# ప్రస్థానత్రయ సారము

( ఉపనిషత్తులు - బ్రహ్మసూత్రాలు - భగవద్గీత )



గ్రంథకర్త

బ్రహ్మశ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు M.A.,

# ముందుమాట

మానవ జీవితానికి పట్టుకొన్న ఒకే ఒక సమస్య విషాదం. దాన్ని పోగొట్టుకొనే మార్గమేమిటా అని చాలా దూర మాలోచించారు మన పెద్దలు. వారే మహర్షులు. వారు ధ్యానంలో కూచొని దర్శించిన సత్యమే ఉపనిషత్తుల రూపంగా వెలువడింది. ఈశావాస్యం మొదలు బృహదారణ్యకం వరకూ పది ఉపనిషత్తుల సారమూ అదే. అది ఉన్నదున్నట్లు ఆకళించు కోలేక వాదోపవాదాలు బయలుదేరితే వాటిని సమన్వయించి చూపాడు మరలా బాదరాయణుడనే ఆచార్యుడు. ఆయన రచించినవే బ్రహ్మ సూత్రాలు. ఉపనిషత్తుల మీద సాగించిన విచారణ కాబట్టి దీనికి వేదాంత మీమాంస అని కూడా పేరు. ఈ రెండింటి మూలంగా మానవుడు గ్రహించిన సిద్ధాంతాన్ని తన దినచర్యలో దృష్టాంతం చేసుకోవాలంటే అది చూపటానికి వచ్చింది భగవద్గీత.

ఇప్పుడీ మూడింటికీ కలిపి ప్రస్థానత్రయమని పేరు పెట్టారు మన ప్రాచీనులు. ప్రస్థానమంటే విషాదమనే సమస్యను తొలగించుకొనే మార్గం. విషాదం సమస్య అయితే మోక్షమనేది దానికి పరిష్కారం. పరిష్కార మార్గం ఒకటే అయినా అది అంచెలవారీగా ప్రయాణంచేసి అందుకోవాలి సాధకుడు. అవి మూడు భూమికలు. ఒకటి శ్రవణం. ఉన్నదంతా ఒకే ఒక ఈశ్వర చైతన్యం. అదే మన స్వరూపం. అంతకు మించి ప్రపంచమనేది వేరుగా లేదు - అని వేదాంతుల సిద్ధాంతం. అది ముందు ఉపనిషత్తుల ద్వారా మనం శ్రవణం చేసి గ్రహించాలి. మరి చరా చర ప్రపంచ మొకటి మన చుట్టూ ప్రతిక్షణమూ చూస్తున్నాము గదా. దీనివల్లనే గదా మనకీ బాధలన్నీ. అలాంటప్పుడిదంతా పరమాత్మే నని ఎలా అర్థం చేసుకోవాలనే సందేహ మేర్పడితే దాన్ని

బ్రహ్మ సూత్రాల ద్వారా మననం చేసి పోగొట్టుకోవాలి మనం. అప్పుడు సంశయం పోయి అంతా ఈశ్వరుడే ననే నిశ్చయ జ్ఞాన ముదయిస్తుంది. అయితే అది మానసికమే గాని ఆ అద్వైత భావం జీవితంలో అనుభవానికి వస్తుందా అని సందేహం. దానికి జవాబిస్తుంది మూడవది భగవద్గీత. ఆ జవాబే నిది ధ్యాస. నిది ధ్యాస అంటే ఏది చూచినా పరమాత్మే ననే దృష్టి వదలకుండా చూడటం.

ఇలా శ్రవణ మనన నిది ధ్యాసలనే మూడు దశలలో ప్రయాణం చేస్తే చాలు. చివరకు విషాదమనే సమస్య తప్పకుండా పరిష్కారమయి మోక్షమనే మహాఫలం సిద్ధించి తీరుతుంది. కనుకనే మూడింటికీ కలిపి ప్రస్థాన త్రయమనే పేరు సార్ధకంగా పెట్టారు శాస్త్రజ్ఞులు. కనుక జీవిత గమ్యమైన పురుషార్థమందు కోవాలంటే ప్రతి భారతీయుడికీ ఈ ప్రస్థాన త్రయమనేదిచదివి అర్థం చేసుకోవలసిన బాధ్యత

ఉంది. ఒక్క భారతీయులకే గాదు. ఆ మాటకు వస్తే ప్రపంచ మానవులందరికీ ఇది కర్తవ్యమే. సందేహం లేదు. ఎందుకంటే అందరికీ ఉన్న సమస్యే సంసార బంధమనేది. అందులో నుంచి బయట పడాలంటే ఇక ఏ లౌకిక విద్యలూ కళలూ పట్టుకొన్నా సుఖం లేదు. ఏదో కొంత జ్ఞాన మందిస్తాయే గాని పరిపూర్ణమైన జ్ఞానాన్ని ఆనందాన్నీ ప్రసాదించ లేవవి. సా విద్యా యా విముక్తయే అన్నారు. ఏది జన్మతారకమో అదే విద్య అంటే. అది ఈ ప్రస్థాన త్రయం ద్వారా మనకు లభించే బ్రహ్మ విద్యే గాని మరేదీ గాదు. అంచేత అలాంటి బ్రహ్మ విద్య మానవుడికవి ఎలా బోధిస్తున్నాయో సంగ్రహంగా తెలుసుకుందా మిప్పుడు.

**యల్లంరాజు శ్రీనివాసరావు**

# ఈశా వాస్యం

ఉననిషత్తులు ప్రధానమైనవి పది అని పేర్కొన్నాము. ఈ పదింటిలో మొదటిది ఈశావాస్యం. **ఈశావాస్యమిదగ్ం సర్వం.** ఈ ప్రపంచమంతా ఈశ్వర చైతన్యంతో నిండి పోయిందని చాటుతున్నదీ ఉపనిషత్తు. అందుకే ఆపేరు వచ్చింది దీనికి. వాస్తవంగా ఇది పరమాత్మ స్వరూపమే అయినా అలా కనపడటం లేదీ ప్రపంచం. నామ రూపాత్మకంగా కనిపిస్తున్నది. అలా కనిపిస్తున్నంత వరకూ దీనివల్ల బాధలు తప్పవు. అంచేత ప్రతి ఒక్కటీ కేవల మున్నదనే స్ఫురణే తప్ప మరే విశేషమూ లేదనే దృష్టి అలవరుచు కోవాలి మనం. ఎక్కడ ఉందా స్ఫురణ. **తదంతరస్య.** ఎక్కడా అనే ప్రశ్నే లేదు. ప్రతి దాని లోపలా వెలపలా సొమ్ములలో బంగారంలాగా వ్యాపించి ఉంది. బంగారమనే దృష్టి వదలకుండా ఆభరణాలు చూచినట్టే ఈశ్వర చైతన్య దృష్టితో చూడాలి ప్రతి ఒక్కటీ.

అయితే అలాటి జ్ఞానం పెట్టుకొని కూచుంటే దినచర్య ఎలా చేయాలి మనం. పరవాలేదు. **ఏవంత్వయి.** మనో వాక్కాయాలతో ఏ పనిచేస్తున్నా దృష్టి పెట్టుకొనే చేయవచ్చు.

అప్పుడీ కర్మ ఆ ఈశ్వర స్పృహ కద్దు రాదు. అది మానసిక స్ఫురణ. ఇది భౌతికమైన చర్య. శత్రుత్వం లేదు రెంటికీ. జ్ఞానవే ఈ కర్మలనే ప్రణాళిక ద్వారా బయటపడి ప్రసరిస్తున్నట్లు చూడవచ్చు. జ్ఞానం కనపడదు. అది చేసే కర్మ కనపడుతుంది. కనపడే ఈ కర్మ ఏదో గాదు. దీని వెనకాల ఆ జ్ఞానమే ఉందనే అవగాహన ఉంటే చాలు. ఇది ఎలాంటిదంటే ఒక బల్బు వెలుగుతుంటుంది. ఒక ఫాను తిరుగుతుంటుంది. ఇవి కనపడుతుంటాయి మనకు. కాని వీటికి ప్రేరణ నిచ్చే విద్యుచ్ఛక్తి కనపడదు. పైకి కనపడక పోయినా దాని క్షేత్రంలోనే ఇవి పని చేస్తున్నట్టు - అదే వీటి ద్వారా బయట పడుతున్నట్టు దర్శించటం లేదా మనం. అలాగే ఇదీ.

అలా దర్శించాలంటే ఈ ఆకారాలకూ వ్యాపారాలకూ **Forms and Functions** వెనకాల ఉన్న ఆ నిరాకారమైన ఆత్మ చైతన్యాన్ని ఒక విద్యుచ్ఛక్తిలాగా అవగాహన చేసుకొనే శక్తి ఉండాలి మానవుడికి. అది కలిగే వరకూ కొంతకాలం ఆ నిర్గుణమైన తత్త్వాన్ని సగుణంగా ధ్యానం చేస్తూ పోవాలి. దీనికే ఉపాసన అని **Meditation** పేరు. అలా చేస్తూ పోతే మనసు బాగా నిర్మలమూ ఏకాగ్రమూ అవుతుంది. చివర

కవసానంలో ఆ భావమే మనసులో నిలిచి సాధకుడు తన ప్రాణశక్తిని సూర్యశక్తిలో ప్రవేశపెట్టి దాన్ని కూడా భేదించుకొని సత్యలోకం దాకా ప్రయాణం చేస్తాడు. అక్కడ నిర్గుణ ధ్యానం చేసే చతుర్ముఖ బ్రహ్మ ఆయన చుట్టూ ఉన్న వసిష్ఠాది మహర్షులతో పాటు తానూ ఆ శిక్షణ పొంది చివరకు నిరాకారమైన ఆ తత్త్వాన్ని తన స్వరూపంగా భావన చేసి తరించగలడు. ఇదీ ఈశావాస్యం మనకు చేసే బోధ.

ఇందులో రెండు భాగాలున్నాయి. ఉత్తమాధికారి అయితే ఇహంలోనే అంతా నిర్గుణమైన తత్త్వమేనని స్వానుభవానికి తెచ్చుకొని ఇక్కడే ముక్తుడవుతాడు. మధ్యమాధికారి **Mediocre** అయితే జీవితాంతమూ సగుణంగా ధ్యానించి మరణానంతరం ధ్యానబలంతో పరలోకానికి వెళ్లి అక్కడ నిర్గుణ జ్ఞాన మలవరుచుకొని తరిస్తాడు. మొదటిది సద్యోముక్తి. రెండవది క్రమముక్తి.

# కేనోపనిషత్తు

అయితే ఈ సాకారమైన ప్రపంచమే గదా మనకు కనిపిస్తున్నది. దీనికి వెనకాల ఒక నిరాకారమైన ఈశ్వర చైతన్యమున్నదా అని సందేహం. ఉన్నదని గట్టిగా చెబుతున్నది

కేనోపనిషత్తు. **కేనేషితంపతతి** - మనసు దగ్గరి నుంచీ మన ఈ శరీరమనే ఉపాధి ఏమి. దీనికి బాహ్యంగా చూచే ఈ చరా చర ప్రపంచమేమి - ఇవి రెండూ ఇలా కనిపిస్తున్నాయంటే వీటి వెనకాల చేరి నడుపుతున్న దొక దివ్యశక్తి. అది వీటిలాగా అపరిపూర్ణం కాదు. పరిపూర్ణమైన జ్ఞానం. పరిపూర్ణమైన శక్తి. అదే ఈశ్వరుడు. అది లేకపోతే ఇవి లేవు. అంతే కాదు. నిరాకారమైన అదే తన శక్తి ప్రభావం చేత సాకారమైన ఈ పిండాండ బ్రహ్మాండాల రూపంలో గోచరిస్తున్నది.

అది మన మర్థం చేసుకోవాలంటే కేవలం దీన్ని మాత్రమే చూస్తూ దీనితోనే వ్యవహరిస్తూ పోతే సరిపోదు. మన ప్రతి ఆలోచనలో - ప్రతి మాటలో ప్రతి చేష్టలో ఈ విశేషాలన్నింటిలో - పరుచుకొని ఉన్న ఆ సామాన్య స్వరూపాన్నే **Universal** దర్శిస్తూ పోవాలి. కంటితో గాదు. మనస్సుతో. నిరాకారం గదా. ఎలా చూడటమని ఆశ్చర్యపడ నక్కరలేదు. నిరాకారమైన ఆకాశాన్ని ఎలా చూస్తున్నావు నీవు. పోతే సుఖమూ దుఃఖమూ భయమూ ఉత్సాహమనే భావాలకు కూడా ఒక ఆకారమంటూ లేదు గదా. వాటినెలా అనుభవించ గలిగావు. అలాగే చూడవచ్చు. చూచే అవకాశ మెంతైనా ఉంది.

అసలు మన మనస్సు కున్న సామర్థ్యాన్ని మనం గుర్తించటం లేదు. అది సవికల్పంగానూ పని చేస్తుంది. నిర్వికల్పంగానూ చేస్తుంది. సవికల్పమంటే ఇదీ అదీ అని సవివరంగా తేడాగా చూడటం. అలాకాక అంతా కలిపి ఒకే ఒక అఖండమైన పదార్థంగా చూస్తే అది నిర్వికల్పం. ఒక చెట్టును చూచేటపుడిది బోద ఇది కొమ్మ ఇది ఆకు ఇది కాయ అనీ చూడవచ్చు. లేదా దూరాన్నుంచి ఒకే ఒక సమష్టి పదార్థంగానూ చూడవచ్చు. ఈ సమష్టికే సామాన్యమని పేరు. ఇందులో దాని విశేషాలన్నీ కలిసిపోయి ఏకంగా ఉంటాయి. అలాగే ప్రస్తుతమీ మనస్సనీ ప్రాణమనీ ఇంద్రియాలనీ ఇలా వేర్వేరుగా గాక ఇదంతా కేవలమొక ఉందనే స్ఫురణే గదా అని భావిస్తూ పోయా మనుకోండి. అది నిర్వికల్పమైన దృష్టి.

ఈ దృష్టి బలపడే కొద్దీ అది నిరాకారం కాబట్టి అందులో ఈ సాకారమైన శరీరం లీనమయి పోయి నిరాకారమైన చైతన్యంగా మనమిందులో నుంచి బయటపడే అవకాశముంది. ప్రతి విశేషంలో దాన్ని దర్శించినప్పుడే అలా జరుగుతుంది. **భూతేషు భూతేషు విచిత్య ధీరాః - ప్రేత్యాముష్మా ల్లోకాదమృతా భవంతి.** ప్రతి పదార్థంలో నిరాకారమైన ఆ

భావాన్ని భావిస్తూ పోతే ఈ శరీరంలో నుంచి  బయటికి వచ్చి బ్రతికుండగానే మన మమృతత్వాన్ని పొందగల మంటుందుపనిషత్తు.  మృతులమై కూడా అమృతులమే మనం. భౌతికంగా మృతులం. ఆధ్యాత్మికంగా అమృతులం. **Immortal.**

ఈ గొప్ప భావాన్నే ఒక కథ ద్వారా బయట పెట్టిందుపనిషత్తు. కథలన్నీ సత్యాన్ని బోధించే సంకేతాలు **symbols** మాత్రమే. సత్యం పరమాత్మ. అది ఏమిటో అగ్నికీ వాయువుకూ అర్థం కాలేదట. అంటే మనస్సుకూ ప్రాణానికని అర్థం. ఆ మనః ప్రాణాలు దేని కుపాధులో అలాటి  జీవచైతన్యమే దేవేంద్రుడు. దానికి కూడా ప్రయత్నం లేకుండా అనుభవానికి రాలేదది. అందుకే ఇంద్రుడు కూడా కళ్లు  మూసుకొని ధ్యానించవలసి వచ్చింది. అప్పు డుమా రూపంగా ఒక దేవత సాక్షాత్కరించి అతనికి మార్గం చూపింది. అది మనసులో  కలిగే బ్రహ్మాకార వృత్తి **The Idea of the Reality.** అదే ప్రమాణం  బ్రహ్మమనే ప్రమేయాన్ని చూడటాని కని ఉపనిషత్తు సందేశం.

# కఠోపనిషత్తు

మనసు బ్రహ్మాకార వృత్తితో నిండిపోతే చాలు. అవసానంలో ఆ మనసే బ్రహ్మాకారంగా వారి అమృతత్వమనే మోక్ష ఫలం లభిస్తుందని హామీ ఇచ్చింది కేనోపనిషత్తు. అమృతత్వమంటే మరణం లేక పోవటమే గదా. నిజంగానే మరణ మనేది లేకుండా పోతుందా అని మానవుడికి మరలా అనుమానం. ఈ అనుమానంతోనే నచికేతుడనే ఒక ముని కుమారుడు యమలోకం దాకా పోయి సాక్షాత్తూ యమధర్మరాజునే నిలదీసి అడిగాడు. **యత్త్వం పశ్యసి తద్వద** - నీవు నిజంగా చూచే చెబుతున్నావా అని అడుగుతాడు.

దానికి యముడు సమాధానమిస్తూ ఆత్మను దర్శించ గలిగితే అది సాధ్యమే నంటాడు. ఆత్మ అంటే ఏమిటి. అది ఎక్కడ ఉంది. **సర్వేషు భూతేషు గూఢః** – ప్రపంచమంతా వ్యాపించి ఉంది. కాని గుప్తంగా ఉంది. మరి ఎలా పట్టుకోటం. బుద్ధి బాగా పదునెక్కితే అదే పట్టుకోగలదా తత్త్వాన్ని. అప్పుడు తమలపాకు నుంచి దాని ఈనె బయటికి లాగినట్టు ఈ నామరూప ప్రపంచం నుంచి వేరు చేసి

చూడగలదా ఆత్మ చైతన్యాన్ని. చూస్తే ఆ చైతన్యానికి మరణం లేదు కాబట్టి దాన్ని పట్టుకొన్న ఈ జీవుడికి కూడా లేదు మరణం. ముక్తుడయి పోతాడు.

కాని చెప్పినంత సులభం కాదది. దానికొక సాధన క్రమముంది. బాహ్యమైన పదార్థాల నుంచి ఇంద్రియాల దగ్గరికి - ఇంద్రియ వృత్తుల నుంచి మనసు దగ్గరికి - మనసు నుంచి అంతకన్నా విశాలమైన మహత్తు దగ్గరికి - దాన్ని కూడా దాటి అవ్యక్తమైన శక్తికీ - ఆశక్తిని కూడా దాటి పూర్ణమైన ఆత్మ చైతన్యానికీ ఎదుగుతూ పోవాలి మానవుడి జ్ఞానం. అప్పుడది ఎక్కడి కక్కడ విశేషరూపంగా పరిమితమై పోక సామాన్యరూపంగా వ్యాపిస్తుంది. అందులో ఈ నామరూపాలన్నీ సముద్ర జలంలో తరంగ బుద్బుదాలలాగా చేరిపోతాయి. అన్నీ చేరిపోయినట్టే జనన మరణాలనే భావాలు కూడా ఒక విశేషమే కాబట్టి అవీ ఆ దృష్టిలో లయమయి పోగలవు.

ఇది ఒక రథ మీశరీరం. జీవుడొక రథికుడు. బుద్ధి వీడికి సారథి. ఇంద్రియాలు దీన్నిలాగే గుఱ్ఱాలు. అయితే ఇవి ప్రాపంచిక విషయాలనే మార్గంలో కాక వీటినన్నింటినీ వ్యాపించిన చైతన్య మనే గమ్యాని కభిముఖంగా పయ నించాలి. అప్పుడే జీవిత గమ్యమైన మోక్షాన్ని అందుకోటం సులభమవుతుంది. ఇదీ కఠోపనిషత్తు మనకిచ్చే సలహా.

# ప్రశ్నోపనిషత్తు

ఇది వినటాని కెంత రమణీయంగా ఉన్నా ఇందులో ఏదైనా ఉపపత్తి చూపితే కాని నమ్మకం పుట్టదు సాధకుడికి. ఉపపత్తి అంటే హేతువు **Reason**. హేతువే కాక దృష్టాంతం కూడా చూపాలి మనకు శాస్త్రం. ఆ బాధ్యత వహిస్తుంది ప్రశ్నోపనిషత్తు. ఆరు ప్రశ్నలు వేశారు ఆరుగురు మహర్షులు పిప్పలాదుడనే బ్రహ్మర్షిని. అందులో మూడు ప్రాణానికీ మూడు మనస్సుకూ సంబంధించినవి. మనస్సులోనే జ్ఞానమనేది ఉదయిస్తుంది. అదే అనుభవానికి కూడా నిలయం. మనసు జ్ఞానశక్తి అయితే ప్రాణం క్రియాశక్తి. సాధన అంతా క్రియే. కాబట్టి మొదట ప్రాణ విషయం నడచింది. తరువాత ఈ క్రియ ద్వారా మనసులో ఏర్పడవలసిన ఆ జ్ఞానమేదో బోధిస్తుం దుపనిషత్తు.

ఎలాగంటే జనన మరణాదులైన భావాలన్నీ నామరూపాల సంపర్కం వల్లనే కలుగుతున్నాయి. ఈ నామరూపాలనే కళలని పేర్కొన్నది. ఇది ప్రాణం మొదలుకొని నామం దాకా పదహారు. షోడశ కళలని పేరు వీటికి. కళ అంటే ఒక శకలం. ఖండం, అఖండమైన ఆత్మ చైతన్యమే 16 కళలుగా కనిపిస్తున్నది మనకు. వీటితో

కలిపి పట్టుకుంటే అది సకలం. అప్పుడు సంసారమే గాని సాయుజ్యానికి నోచుకోలేడు జీవుడు. ఎందుకంటే వీడి బుద్ధి సకలమే. వీడు చూచే ప్రపంచమూ సకలమే. అంచేత ఈ సకలాన్నే మరలా నిష్కలంగా చూడాలి మనం. అంటే ఎక్కడి నుంచి ఈ కళలు జన్మించాయో అక్కడే వీటిని లయం చేసి చూడాలి. చూస్తే అప్పుడీ ప్రపంచమే పరమాత్మగా మారి దర్శనమిస్తుంది. నదులన్నీ మరలా సముద్రంలో కలిసి సముద్రమనే ఒకే ఒక రూపంగా మారినట్టు ప్రాణేంద్రియాది విశేషాలన్నీ నిర్విశేషమైన ఆత్మ చైతన్యంగా అనుభవానికి రాగలవు. అలాంటప్పుడిక జనన మరణాది చింత ఏముంది. అవీ కళలే కాబట్టి చైతన్యరూపంగా నిష్కలమై అనుభవానికి వస్తాయని ప్రశ్నోపనిషత్తు పరిష్కారం.

## ముండకోపనిషత్తు

ఇందులో ఉపపత్తి ఏమంటే ఎందులో నుంచి ఒకటి జన్మిస్తుందో అది అందులోనే చివరకు లయమవుతుంది. అసలది జన్మించటం దాని జన్మస్థానం ఫలానా అని మనకు చూపటానికే. కార్యాన్ని బట్టి కారణాన్ని అందుకోవాలి మానవుడు. అందుకే సృష్టి వాస్తవంగా జరగకపోయినా జరిగినట్టు వర్ణిస్తుంది శాస్త్రం. ఈశ్వరుడు జీవుడుగా వచ్చి

శరీరంలో ప్రవేశించక పోయినా నిజంగా ప్రవేశించినట్టే వర్ణిస్తుంది. ఈ సృష్టి ప్రవేశాలు రెండూ వాస్తవం కావు. శాస్త్రం చేసిన కల్పన. కారణమేమంటే ఇవి వాస్తవంగా చూస్తున్నంత వరకూ మోక్షం లేదు మానవుడికి. అలా చూడవద్దని కేవల మాత్మ తాలూకు ఆభాసే అదే జీవ జగద్రూపంగా భాసిస్తున్నది. వీటి నాధారం చేసుకొని పయనిస్తే ఇవే మనలనా మూలతత్త్వం దగ్గర చేరుస్తాయని చెప్పటమే శాస్త్ర హృదయం.

ఈ భావమిప్పుడు బయటపెడుతున్నది ముండకోప నిషత్తు.

జడపదార్థాల దగ్గరి నుంచి చేతన పదార్థాల వరకూ సమస్తమూ ఆ పరమాత్మ నుంచి అగ్నిహోత్రం నుంచి నిప్పు రవలలాగా చెదిరిపడ్డవే. కనుకనే ఇవి ఆద్యంతాలలో పరమాత్మ స్వరూపమే. మధ్యలో వేరుగా కనపడుతున్నా అదే వీటి స్వరూపం. **బ్రహ్మ పశ్చా ద్బ్రహ్మ పురస్తాత్.** అంచేత మానవుడు తన ముందూ బ్రహ్మమే తన వెనకా బ్రహ్మమే – పైనా క్రిందా చుట్టూ ఉన్నదంతా బ్రహ్మ చైతన్యమేనని చూడాలి. అదే గొప్ప సాధన. దాని కోసం **ప్రణవోధను శ్శరోహ్యాత్మా** - ఓంకారమే ధనుస్సు – మనస్సే అందులో

ఎక్కుపెట్టిన బాణం - బ్రహ్మమే దానికి లక్ష్యమని భావించి దాన్నే భేదించి పట్టుకోవాలి మనస్సుతో నిరంతరం. అదే మోక్షదాయకం.

# మాండూక్యోపనిషత్తు

ఓంకారమంటే అది ఒక శబ్దం. శబ్దమెప్పుడూ అర్థాన్ని చెబుతుంది. సంకేతమే గదా సత్యాన్ని చెబుతుంది. శబ్దం సంకేతం. ఓంకారమనేది అలాటి సంకేతమే. అందులో అ ఉ మ అని మూడక్షరాలున్నాయి. మూడింటికీ మాత్రలని పేరు. మాత్ర అంటే కొలిచేది. ఇందులో అ జీవుడి జాగ్రదవస్థను - ఉ స్వప్నావస్థను - మ సుషుప్తినీ కొలుస్తాయి. అవి కొలుస్తుంటే ఆత్మ చైతన్యం వాటిచేత కొలవబడుతుంటుంది. వాటికి పాదాలని పేరు. స్వతహాగా కొలత లేని ఆత్మ ఈ కొలమానంతో జీవరూపంగా మారి మూడవస్థ లనుభవిస్తున్నది. ఇదే సంసార బంధం. మాత్రలు ఆలోచనలైతే పాదాలు వాటి తాలూకు బాహ్యరూపాలు. **Ideas and Things.** ఇలాంటి వాచ్యవాచక సంబంధమనే లావాదేవీ ఉన్నంత వరకూ సంసార క్లేశం తప్పదు మనకు.

ఇప్పుడీ అవస్థాత్రయం దాటిపోతే గాని తురీయమనే అవస్థ **Fourth Dimension.** నందు కోలేము. అదే సమాధి అదే మోక్షం. అప్పుడీ మాత్రలూ పాదాలూ ఏమవుతాయి. అవి మనం తురీయ స్థితి నర్థం చేసుకోటానికి కల్పించుకొన్న సంకేతాలే. కాబట్టి ఆ స్థితి నందుకొన్న మరుక్షణం అందులో లయమయి పోతాయి. అప్పుడా దశ అమాత్ర మనీ అపాదమనీ – మాత్రా పాదాలుగా కనపడేవి రెండూ కలిసి ఏకమయి పోతాయని – వర్ణిస్తుంది ఈ మాండూక్యమనే ఉపనిషత్తు.

దానితో **చతుర్థం శివ మద్వైతం -** తురీయమనే ఈ నాలుగవ దశ మానవుణ్ణి శవం గాకుండా శివంగా మారుస్తుంది. కారణమది అద్వైతం. అందులో జనన మరణాది భేదం లేదు. **స విజ్ఞేయః** దాన్నే ఎప్పటికైనా అనుభవానికి తెచ్చుకోవాలి సాధకుడు. అది ఎలాగా అని అడిగితే **ఏకాత్మప్రత్యయసారం -** అన్ని దశలలోనూ ఉన్నదొకే ఒక ఆత్మ చైతన్యమనే అఖండాత్మ భావనే మనకు ప్రమాణం **Instrument of Knowledge.** దానితోనే పట్టుకోవాలా తురీయావస్థనని బోధిస్తున్నది మనకు మాండూక్యం.

# తైత్తిరీయోపనిషత్తు

పోతే ఇంతకు ముందుగానే చెప్పామొక మాట. జగత్తుది సృష్టి అని జీవుడిది సృష్టి గాదు ప్రవేశమని. పరమాత్మే జీవరూపంగా వచ్చిశరీరంలో ప్రవేశించాడట. ప్రవేశించి ఈ ఉపాధులతో చేయి కలిపి తన స్వరూపమే తాను మరచిపోయాడు. మరచిపోతేనే వాడు జీవుడు. ఇదే సంసార బంధం. విషాదం. మరలా తన పొరబాటు తాను గుర్తించి తన నిజస్వరూపం వెతుకుతూ పోయి ఈ బంధం వదలించుకోటమే సాయుజ్యమీ జీవుడికి. అది ఎలాగో వర్ణించటానికి వచ్చాయి రెండు పనిషత్తులు. మొదటిది తైత్తిరీయం. రెండవది ఐతరేయం. అందులో తైత్తిరీయం జీవుడి రాకపోకలెలా వర్ణిస్తున్నదో చూతాము.

**తస్మా దేతస్మా దాత్మన ఆకాశః** అని ప్రారంభం. ఆత్మ నుంచి ఆకాశం. దాని నుంచి వాయువు. వాయువు నుంచి తేజస్సు. ఇలా వరసగా వచ్చి మానవ శరీరంలో బుద్ధి అనే గుహలో చేరిపోయిందట అది. బాహ్యంగా ఆకాశాది పంచభూతాలైతే – ఆంతర్యంగా పంచకోశాలు. కోశమంటే ఒక **Sheath or Cover.** అవి మన శరీరంలోనే ఉన్నాయి. పై నుంచి చూస్తే ఆనందమయ కోశం ఆకాశానికి సరిపోతుంది.

విజ్ఞానమయ కోశం వాయువు లాంటిది. మనోమయం తేజస్సుకు. ప్రాణమయం జలానికి. చివర కన్న మయం పృథివికి సరిపడతాయి. అవి బ్రహ్మాండ మివి పిండాండం. **Macro & Micro.**

ఇప్పుడీ అన్నమయాది కోశాలలో ఆత్మ చైతన్యమనేది మూసలో పోసిన పంచదార పాకానికా మూస రూపం వచ్చినట్టు ఆకోశ రూప మేర్పడి అలాగే కనిపిస్తున్నది. వీటిలో నుంచి బయట పడాలంటే ఈకోశాలు నా ఉపాధులే **Media** గాని నా స్వరూపం గాదని గుర్తించాలి ఈ జీవుడు. గుర్తించాలంటే శుద్ధ చైతన్యమే తానని దాన్నే మనసుకు తెచ్చుకోవాలి. అదే ఆత్మ భావన. ఈ భావన బలపడే కొద్దీ అన్నమయాది కోశాలను క్రమంగా దాటిపోయి చివరకు ఆనందామయాన్ని కూడా దాటుతూ పోతాడు. దాటుతూ పోతే అవి తన స్వరూపంలో లయమైనట్టు చూడగలడు. అప్పుడు వీటితో పాటు పృథివి మొదలు ఆకాశందాకా ఉన్న పంచభూతాలు కూడా లయం కాక తప్పదు. అప్పుడంతా ఆత్మ స్వరూపమే కాబట్టి జీవేశ్వరులనే తేడా కూడా వెంటనే తొలగిపోతుంది. అదే మోక్షం. ఇదీ తైత్తిరీయ సారం.

# ఐతరేయోపనిషత్తు

తైత్తిరీయం లాగే ఐతరేయం కూడా జీవుడి రాకపోకలే వర్ణిస్తుంది. కాని తేడా ఏమంటే జీవుడి జ్ఞానం బుద్ధిలో ప్రవేశిస్తే ప్రాణం పాద తలం నుంచి లోపలికి వచ్చిందట. తన్మూలంగానే వీడు తన సర్వజ్ఞతను పోగొట్టుకొని ఇంద్రియాల ద్వారా విశేష జ్ఞాన మార్జిస్తూ దానితోనే తృప్తి పడుతుంటాడు. అంతే కాదు. జాగ్రత్తు స్వప్నం సుషుప్తి అనే మూడు దశలు కూడా వాటి వల్లనే అనుభవిస్తుంటాడు. ఈ విశేషానుభవమే సంసార బంధం వీడికి.

మరలా వీడీ బంధం నుంచి బయటపడాలంటే సుషుప్తి అనే మూడవ అవస్థను కూడా దాటిపోవాలి. సుషుప్తి అంటే అజ్ఞానం. విశేష జ్ఞానమే ఇక్కడ అజ్ఞానమంటే. అది జాగ్రత్స్వప్నాలలో వృత్తి రూపంగా పనిచేస్తుంది. సుషుప్తిలో వాసనగా **Impression** మారుతుంది. వాసన భేదించాలంటే విశేష జ్ఞానంగాక సామాన్యమైన ఆత్మ జ్ఞానం సంపాదించాలి. తన స్వరూపమే తాను చూచే ప్రపంచమంతా పరుచుకొని ఉన్నట్టు దర్శించాలి. అప్పుడది విజ్ఞానం కాదు. ప్రజ్ఞానమవుతుంది. నీవూ నీవు చూచే చరా చర ప్రపంచమంతా ప్రజ్ఞానంలోనే ఉంది. అంతా ప్రజ్ఞాన స్వరూపమే ననే రహస్యమప్పు డనుభవానికి రాగలడు. అదే జీవ బ్రహ్మైక్య మదే మోక్షం. ఐతరేయ సారమిదే.

# ఛాందోగ్యోపనిషత్తు

పోతే ఇక రెండుపనిషత్తు లున్నాయి. ఛాందోగ్య మొకటి. బృహదారణ్య మొకటి. ఛాందోగ్యం **తత్త్వమసి** - నీవు పరమాత్మవేనని మనకు పదేశిస్తుంది. బృహదారణ్యకం **అహంబ్రహ్మాస్మి** - నేనా పరమాత్మనే అని జీవుడికా ఉపదేశ మనుభవానికి తెస్తుంది. కాని జీవుడికీ జగత్తనేది ఇలా కనిపిస్తున్న వరకూ నీవు పరమాత్మవేనని చెప్పినా ప్రయోజనం లేదు. కనుక **ఐతదాత్మ్య మిదగ్ం సర్వం** ఇదంతా కూడా ఆత్మ స్వరూపమేనని దీన్ని ఆత్మ చైతన్యంలో లయం చేసి చూపుతుంది ఛాందోగ్యం. జగత్తులయమైతే చాలు. జీవుడ ప్రయత్నంగా ఈశ్వర స్వరూపుడే అవుతాడు.

కాని జగత్తు ఎలా లయమవుతుంది. జగత్తనేది ఒక కార్యం. అంటే ఒక దాని నుంచి తయారయింది. దేని నుంచి తయారయిందో అది దీనికి కారణం. కారణం కంటే దాని కార్యం వేరుగాదని సిద్ధాంతం. మట్టి కన్నా కుండ వేరు గాదు గదా. బంగారం కన్నా ఆభరణం వేరు గాదు గదా. అలాగే అస్తిభాతి. ఉన్నదనే స్ఫురణ కంటే లోకంలో ఏ పదార్థం కానీ అన్యంగా లేదు. ఏదైనా ఉన్నట్టు స్ఫురించేదే. ఉందనే స్ఫురణ తీసేస్తే ఆ పదార్థమే లేదు.

మన మనోభావాల దగ్గరి నుంచి బాహ్యమైన ఆకాశం వరకూ ప్రతిదీ ఉంది స్ఫురిస్తున్నదనేగా చూస్తున్నావు. ఆ ఉండటం స్ఫురించటమే పరమాత్మ. అదే ఆశ్రయ **Basis** మీ నామరూపాలకు. ఇవేవో స్వతహాగా ఉన్నాయని గాదు. అలా స్వతంత్రంగా ఉన్నదా సచ్చిద్రూపమైన ఆత్మే. అదే ఈ నామరూపాలుగా కూడా భాసిస్తున్నది. ఇవి దాని విభూతి **Manifestation** అది వీటి స్వరూపం. **Substance.**

ఇలా అర్థం చేసుకోగలిగితే జనన మరణాలు కూడా మన స్వరూపమే అయి అమృతత్వమే సిద్ధిస్తుంది మానవుడికి. ఈ రహస్యం శ్వేత కేతువనే కుఱ్ఱవాడి కుద్దాలకుడూ - నారదుడనే దేవర్షికి సనత్కుమారుడూ - చివరకు దేవేంద్రుడికి బ్రహ్మ దేవుడూ - బోధ చేశారని చెబుతున్నది ఛాందోగ్యం. దీనికే భూమ విద్య అని పేరు పెట్టింది. ఎక్కడ ఉందా భూమ **The summum Bonum** అని అడిగితే **సఏవోపరిష్టాత్స ఏవాధస్తాత్ -** ఇక్కడా అక్కడా అని తేడా లేదు. సర్వత్రా సర్వదా సర్వరూపాలలో పరుచుకొని ఉన్నదదే. అదే జీవుడి స్వరూపమదే ఈ ప్రపంచ స్వరూపమని బ్రహ్మాండమైన ఆధ్యాత్మిక రహస్యం మనకుపదేశిస్తుంది ఛాందోగ్యం.

# బృహదారణ్యకం

దశోపనిషత్తులలో ఆఖరిది బృహదారణ్యకం. ఇది పరిమాణంలోనూ గుణంలోనూ పెద్దది. ఛాందోగ్యం పరోక్షమైన **Indirect** జ్ఞానమిస్తే ఇది అపరోక్షమైన **Direct** అనుభూతినే ప్రసాదిస్తుంది మానవుడికి. దాన్ని ఒక మాటలో గుప్తం చేసి చెబితే అదే **అహం బ్రహ్మాస్మి.** నేనే బ్రహ్మం బ్రహ్మమే నేనని భావం. బ్రహ్మమనేది ఎక్కడో దూరంగా ఉందనే భ్రాంతి పోవాలి మనకు. అది ఎంత దూరమో అంత దగ్గర. **యదేహ తదముత్ర.** నిరాకారమూ వ్యాపకమూ అయిన ఆకాశానికి దూరం దగ్గర ఏముంది. సర్వత్ర ఉందని చూడటం లేదా మనం. అలాగే అంతకన్నా పెద్దదైన జ్ఞానస్వరూపమైన ఆకాశ మాత్మ అనేది. ఇది జడాకాశమైతే అది చిదాకాశం **Conscious Space.** నన్ను నేను ఎలా ఉన్నా నని చూచు కొంటున్నానో నా చుట్టూ ఉన్న జగత్తును కూడా ఉందనే చూస్తుంటాను. ఈ ఉండటమనే స్ఫురణ ఇప్పుడెక్కడ ఉందంటావు. నా లోపలా వెలపలా అంతటా పరుచుకొనే ఉందా లేదా.

ఇలా ఏది పరచుకొని సర్వ పదార్థాలలోనూ కనిపిస్తుంటుందో అది సామాన్యం **Universal.** ఆభరణాలలో బంగారంలాగా. పోతే అది వేటి లోపలా వెలపలా వ్యాపించి ఉందో అవి విశేషాలు. సామాన్య మన్నిటినీ వ్యాపించినట్టు విశేషాలు వ్యాపించలేవు. కాని రెండూ ఎప్పుడూ ఎక్కడబడితే అక్కడ కలిసే ఉంటాయి. కలిసి ఉన్నా మన మాయా విశేషాలతోనే సంబంధం పెట్టుకొంటాము గాని అక్కడే ఉన్న సామాన్యంతో పెట్టుకోము. కారణమేమంటే దృశ్య ప్రపంచంలాగా మన దృష్టి కూడా విశేషమే అయి కూచుంది. అందుకే మనమీ శరీరమనః ప్రాణాలనే విశేషాలే నేనని అభిమానించాము. ఆ దృష్టి వదలకుండానే భార్యా పుత్రులనూ వస్తు వాహనాలనూ విశేషాలుగానే చూస్తుంటాము. ఈ విశేష దృష్టి వదలుకోనంత వరకూ మానవుడికి మోక్షం లేదు.

ఒక యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయికి చేశాడన్నా ఇదే బోధ. ఆ యాజ్ఞవల్క్యుడే జనక మహారాజు సభలో గార్గి మొదలైన వారికి చేశాడన్నా ఇదే బోధ. ఇవన్నీ కథలు. కేవలం సంకేతాలు. సంకేత మెప్పుడూ సత్యాన్ని

బయటపెట్టటానికే ఉంటుంది. ఇక్కడ ఈ సంకేతాలన్నీ మనకు చాటి చెప్పే సత్యం సర్వమూ పరమాత్మ స్వరూపమే అదే నీవు జీవుడని భావించే నీ స్వరూపం కూడాననే ఏకైక సత్యం. **ఇదం సర్వం యదయ మాత్మా - అహం బ్రహ్మాస్మి** అని రెండు మాటలలో దీన్ని చాటి చెబుతున్నది ఉపనిషత్తు.

అయితే ఇది ఒక్కసారిగా అందుకోగలిగితే వాడుత్త మాధికారి **Competent.** అలా కాకుంటే శ్రవణ మనన నిది ధ్యాసలనే మూడు భూమికలలో అంచెలవారిగా సాధన చేసి అనుభవానికి తెచ్చుకోమని సాధన మార్గాన్ని కూడా ఉపదేశించిందీ ఉపనిషత్తు. ఇది జీవితంలోనే ప్రయత్నించాలి మానవుడు. నిర్లక్ష్యం చేశాడో ఎంత అనర్ధానికైనా దారి తీస్తుంది. అదే జనన మరణ పరంపర అని కూడా హెచ్చరించింది. ఇదీ బృహదారణ్య సారం.

# బ్రహ్మ సూత్రాలు

ఉపనిషత్తులు శ్రవణ ప్రధానమైతే బ్రహ్మ సూత్రాలు మనన ప్రధానమని చెప్పాము. మనన మంటే విచారణ, ఉపనిషద్వాక్యాల మీదనే మననం చేశాడు బాదరాయణుడనే ఆచార్యుడు. దాని ఫలితమే ఈ బ్రహ్మసూత్రాలనే గ్రంథం. 555 సూత్రాలున్నా యిందులో. అవి నాలుగ ధ్యాయాలుగా విభజించాడు. అందులో మొదటిది సమన్వయం. రెండవది అవిరోధం - మూడవది సాధన. నాలుగవది ఫలం.

# సమన్వయం

బ్రహ్మమే ప్రపంచ సృష్టికి మూల కారణం. మరేదీ కాదని సమన్వయించి చూపాడు కాబట్టి సమన్వయాధ్యాయ మని పేరు వచ్చింది. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అనే సూత్రంతో ఆరంభ మవుతుంది. బ్రహ్మ తత్త్వాన్ని గురించి అన్వేషణ చేయాలి. ఎందుకు. అదే పరమ పురుషార్థం. దాన్ని తెలుసుకొంటే చాలు. సమస్తమూ తెలిసిపోతుంది. ఎలాగ. సృష్టిని బట్టే సృష్టి కర్తను గ్రహించాలి ఎప్పుడేగాని. ప్రపంచ సృష్టికి బ్రహ్మమే కర్త.

అదేమిటి. ప్రకృతే కారణమన్నాడు కపిలుడు. పరమాణువులే కారణమన్నాడు కణాదుడు. అంతకు ముందు లేదీ ప్రపంచం. తరువాత వచ్చింది కాబట్టి అభావమే

కారణమన్నారు బౌద్ధులు. అసలేదీ గాదు. దానిపాటికది సహజంగానే తయారయి ఉందన్నారు స్వభావవాదులు. ఇవన్నీ కొట్టేశారు బాదరాయణులు. ప్రకృతి అంటే అచేతనం గదా. దానికి సృష్టి చేయాలనే సంకల్ప మెక్కడిది. మరి పరమాణువులు పోగయిగదా సృష్టి జరగవలసింది. వాటిని పోగు చేసిన వాడెవడు. స్వభావ మంటారా. దానిపాటికది జరగాలంటే అది ఇప్పుడు కూడా జరగాలి గదా. ఏదీ ఏ ఒక్క అచేతన పదార్థమూ చేతనం సహాయం లేకుండా కదలిపోవటం లేదు గదా. ఇక అభావమే కారణమంటారా. అభావమంటే లేనిది గదా. లేని దానిలో నుంచి ఉన్నది ఎలా వస్తుంది. పైగా ఆ వచ్చిన ప్రపంచాన్ని ఉందనే చూస్తున్నాము గదా. కార్య ప్రపంచమున్నప్పుడు దాని కారణం లేనిదెలా అవుతుందని నాలుగింటినీ త్రోసిపుచ్చారు.

అంతేగాదు. చేతనమైన పరమాత్మే దీనికి కారణమన్నప్పుడెలాంటి కారణమది. నిమిత్తమా ఉపాదానమా. నిమిత్తమంటే చేతనం. ఉపాదానమంటే అచేతనం. కుండకు కారణం చేతనుడైన కుమ్మరీ కారణమే. అచేతనమైన మట్టీ కారణమే. రెండూ ఉండాలి. ఇక్కడ రెండూ వేరుగా లేవు. నిమిత్తోపాదానాలు రెండూ పరమాత్మే ప్రపంచానికి. కనుకనే ప్రపంచానికెంత అతీతమో అంత దగ్గరగా ప్రపంచంలో ప్రతి అణువూ మృత్తికలాగా వ్యాపించి ఉన్నాడు. ఇదీ బాదరాయణులు చేసిన సమన్వయం.

# అవిరోధం

అయితే ఇది కపిలాది అచేతన కారణ వాదులు గాని ఈశ్వర కారణ వాదులైన ద్వైతులు గాని ఒప్పుకోలేదు. కేవలం చేతనమే కారణమైతే అందులో నుంచి దానికి విలక్షణమైన జడ ప్రపంచమెలా వచ్చిందని వారి వాదం. దానికి బాదరాయణుల సమాధానమేమంటే రాలేదు వాస్తవంలో ప్రపంచం. ఇది ఆరంభం కాదు **Creation.** లేదా పరిణామమూ **Evolution** కాదు. అలాగైతే పరమాత్మ దెబ్బతింటాడు. నిరాకారమూ సర్వవ్యాపకం గదా పరమాత్మ అంటే. అలాంటప్పుడు రెండవ పదార్ధమెలా రాగలదు. రెండవది వాస్తవమే అయితే పరమాత్మ సర్వవ్యాపకమెలా కాగలడు. కనుక ఆరంభ పరిణామాలు చెప్పగూడదు.

మరి ఎలా వచ్చిందీ ప్రపంచం. ఇది కేవలం వివర్తం. అంటే సృష్టి జరిగినట్టు చేసినట్టు భాసిస్తున్నదే గాని వాస్తవంగా జరగలేదు. మరి ఈ భాసిస్తున్నదెవరు. ప్రపంచం కాదు. పరమాత్మే ప్రపంచంగా కనిపిస్తున్నాడు. సచ్చిద్రూపంగా అది స్వరూపావస్థ. నామరూపాత్మకంగా అది విభూతి **Mainfestation.** వస్తువొక్కటే. రెండవది వస్తువు గాదు. దాని విస్తారం. సువర్ణమొక్కటే. కంటెలు కమ్మలు కాసుల

దండలు ఒడ్డాణాలు దాని విభూతి లేదా విస్తారం. దీనికే సంస్థానమని పేరు పెట్టారు భగవత్పాదులు. సువర్ణ సంస్థానమాభరణాలయినట్టే సత్సంస్థానమే **constitution** ఈ ప్రపంచం.

మరి ద్వైతులు కూడా ఈశ్వర కారణవాదులే గదా. వారిని కాదనటం దేనికని ప్రశ్న. వారు ఈశ్వరుణ్ణి నిమిత్తంగానే ఒప్పుకొంటారు గాని ఉపాదానంగా ఒప్పుకోరు. అలాంటప్పుడా ఈశ్వరుడింత విషమంగా నిర్దాక్షిణ్యంగా సృష్టి ఎందుకు చేశాడని ప్రశ్న వస్తుంది. అంతేగాక కర్తృత్వం చెప్పినప్పుడు భోక్తృత్వం కూడా ఈశ్వరుడికే చెప్పవలసి వస్తుంది. అప్పుడిక జీవుడికి లేవు బంధ మోక్షాలు. ఈశ్వరుడి మెడకే చుట్టుకుంటాయి. ఉపాదానం కూడా ఈశ్వరుడే అయితే ఈ ప్రమాదం లేదు. ఎందుకంటే జీవజగత్తులు కూడా ఈశ్వర చైతన్యమే వ్యాపిస్తుంది. వ్యాపిస్తే జీవజగత్తులు వాస్తవం కాక ఆభాస అవుతాయి. అప్పుడిక బంధ మోక్షాలు జీవుడికి చెప్పినా అవీ ఆ భాసే వాస్తవం కావు. కనుక కార్యకారణాల కెలాటి విరోధమూ కాదు. రెండూ ఒకే ఒక స్వరూపమవుతాయి. అయితే అవిరోధమే.

# సాధనాధ్యాయం

అవిరోధమయింది. ఇక సాధన. జీవ జగదీశ్వరులు ముగ్గురూ చైతన్యరూపంగా ఏకమేనని తీర్మానించారు. అయితే ఇక సాధన ఏమిటి. ఎలా చేయాలి. ఎవరు చేయాలి. అని ప్రశ్న. జీవుడే చేయాలన్నారు. వీడు ఈశ్వరుడే నన్నారు గదా. నిజమే – వస్తుతః ఈశ్వరుడే – కాని అలా భావించటం లేదీ జీవుడు. మరేమని భావిస్తున్నాడు. నేను శరీరమూ మనస్సూ ప్రాణమే ఇంతకన్నా వేరుగా లేనని భావిస్తున్నాడు. ఈశ్వరుడయి కూడా కానని భావించట మెలా జరిగింది. అనాది కాలం నుంచి వస్తున్న అవిద్య లేదా అజ్ఞానం వల్లనని జవాబిస్తారు అద్వైతులు.

అజ్ఞానమంటే జ్ఞానం లేకపోవటం కాదు. అంతో ఇంతో జ్ఞానముంది మనకిప్పుడు. అయితే అది పరిపూర్ణంగా లేదు. సర్వవ్యాపకంగా ఉన్నాను నేనని భావిస్తే అది పూర్ణ జ్ఞానం. అలా కాక ఒక శరీరం మేరకే ఉన్నానని భ్రమపడితే అది విశేష జ్ఞానం. ఈ విశేష జ్ఞానమే అజ్ఞానం. అంటే సర్వవ్యాపకమైన జ్ఞానం లేక పోవటం. అది లేకపోతే నేమి. ఇది ఉంది గదా అంటే – దీనివల్ల ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవిక తాపత్రయమను భవించ వలసి వస్తున్నది. ఇదే సంసార

బంధం మానవుడికి. ఈ సమస్య నుంచి బయటపడాలంటే నేనా  పరమాత్మనే ననే పరిపూర్ణ జ్ఞానమందు కోవాలి.

అది ఎలాగ, క్రొత్తగా అందుకోనక్కర లేదు. వాస్తవంగా ఈ జీవుడీశ్వరుడే గనుక కేవల మా సత్యాన్ని గుర్తిస్తే చాలు. దీనికే ప్రత్యభిజ్ఞ **Recognition** అని పేరు. శాస్త్రం దీనినే తత్త్వమసి వాక్యం ద్వారా మనకు బోధిస్తున్నది. నీవా సచ్చిద్రూపుడవనే  ఈ వాక్యాని కర్థం. కేవలం నేను సన్మాత్రుడనే చిన్మాత్రుడనే నని అర్థం చేసుకొంటే సద్విశేషమైన ప్రపంచమూ చిద్విశేషమైన భావ ప్రపంచమూ ఏమయిపోతాయి. అవి ఈ సచ్చిద్దృష్టితో చూస్తుంటాడు కాబట్టి అందులో కరిగిపోతాయి. ఎలా పోతాయని ప్రశ్న లేదు. వాస్తవమైతే పోదుగాని ఆభాస అయితే తప్పకుండా పోతుంది. ఒక స్వప్నం మెలకువ వచ్చే సరికెలా పోతుందో అలాగే నన్నారు. అయితే వాస్తవమేదో దాని బలంతో గాని ఇది పోదు. రజ్జువును చూడకుండా సర్పమెలా పోతుంది. అలాగే తన సదాకార చిదాకార స్వరూపాన్ని గుర్తు చేసుకొని ఆ దృష్టితో జీవుడీ ప్రపంచాన్ని చూచినప్పుడే  ఇది తేలిపోతుంది. ఈ భావనే వేదాంతంలో సాధన. జీవించినంత కాలమీ భావనలో ఆ భాసగా తేలిపోయి  ఒక నీడలాగా కనిపిస్తుంది ప్రపంచం. జీవితానంతరం శరీరమే లేకుండా పోతుంది కాబట్టి ఆభాసగా కనిపించేది కూడా తన శక్తిగా మారి అనుభవానికి రాగలదు.

# ఫలాధ్యాయం

సాధన అయిన తరువాత చివరగా చెప్పుకోవలసింది ఫలం. ఫలమనేది మోక్షమే. మోక్షమంటే విడుదల. శరీరమూ ప్రపంచమూ ఇవి రెండే గదా బంధం మనకు. వీటివల్లనే గదా సమస్య. ఇవి రెండూ ఆభాస అని తేల్చుకున్న తరువాత ఇక తాను కర్త కాడీ జీవుడు. కర్త కాకుంటే భోక్తా కాదు. కేవలం సాక్షిగా మిగిలిపోతాడు. కర్మఫలమైన సుఖదుఃఖాదులేవీ లేవు కాబట్టి నిత్యమూ సుఖమే. తన చైతన్య స్వరూపమే తనకెప్పుడూ ఎక్కడబడితే అక్కడ దర్శనమిస్తుంది. అంతా ఆత్మే అనాత్మ లేదు. ఈ ఏకాత్మ భావమే మోక్షం. ఏది చూచినా ఏది చేసినా ఏది ఆలోచించినా తానే తనలో అద్దంలో ముఖంలాగా తనకు తానే ఉన్నాననే ప్రజ్ఞతో ఉంటాడు. సుఖదుఃఖాలూ జనన మరణాలూ కూడా తన స్వరూపమే. అప్పుడిక మరణమనే భయం కూడా ఎగిరిపోతుంది. మరణమంటే మరణించేవాడూ మరణమూ వేరుగా ఉన్నప్పుడే గదా. అంతా నిరాకారమైన ఆత్మే అయినప్పుడిక మరణమెక్కడిది. అయితే మరణమెవరికి. శరీరానికి తనకు గాదు. చైతన్యంగా మరణంచడు. దాని

ఆభాసగా మరణిస్తాడు. ఇది ఒక గొప్ప అనుభూతి. సముద్రం జలంగా మరణించదు. తరంగ బుద్బుదాదులుగా మారుతుంది మరణిస్తుంది. తన మరణాన్ని తానే చూస్తుంది. అలా చూడగలిగితే మరణం కాదది. మోక్షం. క్రొత్తగా వచ్చేది గాదీ ఫలితం. వస్తు సిద్ధంగా ముక్తులమే మనం. బుద్ధి సిద్ధంగా కాకుండా పోయాము. మరలా వస్తువును గుర్తిస్తే అది వస్తు బుద్ధి కాబట్టి ఎప్పుడూ ముక్తులమే ననే ప్రత్యభిజ్ఞ కలుగుతుంది. ఆ జ్ఞానాగ్నిలో ఈ జ్ఞేయ ప్రపంచమంతా సమిధల లాగా కాలి బూడిద అయిపోతుంది. కాబట్టి అసలు సంసార బంధమనే ప్రశ్నే లేదు. దీనికే ప్రవిలాపన **Thorough merger** మని పేరు పెట్టారు. ఇదే జీవిత పరమార్థమైన మోక్ష ఫలం.

# భగవద్గీత

ఉపనిషత్తులూ బ్రహ్మ సూత్రాలూ రెండూ చెప్పు కొన్నాము. ఒకటి శ్రవణ ప్రధానమైతే ఇంకొకటి మనన ప్రధానమని కూడా పేర్కొన్నాము. ఆ రెండింటి సారమేదో గ్రహించాము. పోతే ఆ శ్రవణమైన మననమైన జ్ఞానాన్ని దినచర్యలో స్వానుభవానికి తెచ్చుకొనే మార్గమేదో అది ఆలోచించాలి. అలా తెచ్చుకోటానికే నిది ధ్యాస అని పేరు. దాన్ని మనకు బోధించటానికే వచ్చింది భగవద్గీత లోకంలోకి. ఇది 18 అధ్యాయాల గ్రంథం. అందులో మొదటిది సమస్యను చెబుతుంది. అదే విషాద యోగం. చివరిది దానికి పరిష్కారం తెలుపుతుంది. అది మోక్ష సన్న్యాసం. పోతే మధ్యలో ఉన్న పదహారూ రకరకాలుగా ఆ మార్గాన్ని చిలువలు పలువలు పెట్టి వర్ణిస్తాయి. క్రమంగా తెలుసుకొందాము.

# విషాదయోగం

కురుక్షేత్రమేదో గాదు. సంసారం. రథం మనశరీరమే. ఇందులో కూచున్న జీవుడే అర్జునుడు. నరుడని కూడా అర్జునుడికి పేరు. పోతే సారథి కృష్ణుడు మన బుద్ధి. జీవితమే సంగ్రామం. ఇందులో అనుకూల ప్రతికూల పరిస్థితులే పాండవ కౌరవ సేనలు. మనబోటి జీవులే చేయాలీ యుద్ధం.

చేస్తే జయమో అపజయమో చెప్పలేము. పరిస్థితులను కూలమైతే విజయం. ప్రతికూలమైతే పరాజయమే. చాలావరకు మన మాసించిన దెప్పుడూ జరగదు. అనుకూలించదు. కనుక పరాజయమే మూడు వంతులు. అందుకే తరుచు విషాదమే ఎదురవుతుంది మానవుడికి.

ఏమి కారణం. పరిస్థితులను కూలించకనా. కావచ్చు. ఎందుకనుకూ లించటం లేదు. అహంకార మమకారాలే దీనికంతటికీ కారణం. ఈ శరీరం మేరకే నేనని అభిమానించటం అహంకారమైతే మిగతా దంతానా కన్యమని చూడటం మమకారం. శరీరం వర కాగిపోతే మిగతా దన్యం గాక ఏమవుతుంది. అందులో కూడా తనకు కావలసిందైతేనే మరలా మమ అని చూస్తాడు. లేకుంటే న మమ – నాకక్కర లేదని త్రోసిపుచ్చుతాడు. ఇవే రాగద్వేషాలనే ద్వంద్వాలు. వాటివల్ల సుఖదుఃఖాలు. ఇదే సంసార బంధం. అన్నిటికీ మూలమీ అహంకారమే. అంటే దేహాత్మాభిమానం. అది మమకారానికి దారి తీస్తే – అది అనుకూల ప్రతికూలాలను సృష్టిస్తే – దానివల్ల సుఖదుఃఖాది ద్వంద్వ లేర్పడుతున్నాయి. అర్జునుడి కెదురయిన సమస్య ఇదే. ఇదే విషాదం.

ఒక అర్జునుడికే గాదు మనందరికీ జీవితంలో నిత్యమూ ఎదురయ్యే సమస్యే ఇది. ఈ విష వలయంలో చిక్కి నతమతమవు తుంటాడు నరుడు. వాడెంత కోటీశ్వరుడైనా ఎంతనిష్ఠ దరిద్రుడైనా - ఎలాటి మేధావంతుడైనా - ఏమాత్రం తెలివిలేని మూఢుడైనా - తప్పదీ విషాదయోగం.

## సాంఖ్యయోగం

మరేమిటి దీనికి పరిష్కారం. చికిత్స చేసే ముందు వ్యాధి ఏమిటో అది ఎలా వచ్చిందో తెలుసుకోవాలి. వ్యాధి విషాదం. అది దేహాత్మాభిమాన రూపమైన అహం కారం వల్ల వచ్చిందని తెలిసిపోయింది. పోతే దీని నెలా పరిష్కరించుకోవాలి. సాంఖ్యమే పరిష్కారం. సాంఖ్యమంటే వేరు చేసి చూడటం. ఆత్మ అనాత్మ రెండూ కలిసి కలగా పులగమయి ఉన్నాయి. శరీరానికి వేరుగా ఉంది మన ఆత్మ. అది శుద్ధ చైతన్యం. ఇది జడమీ శరీరం. సంబంధం లేదు. అయినా ఈ దేహమే నా స్వరూపమని భ్రమ పడుతున్నాము. అందుకే ఇది జన్మిస్తే నేను జన్మించానని - ఇది మరణిస్తే నేనే మరణిస్తున్నానని దీని లక్షణాలు నామీద ఆరోపించు కొన్నాను.

నిజంలో నేననే జ్ఞానమెప్పుడూ మారదు మరణించదు. చైతన్య రూపంగా అందరూ నిత్యులే. దేహమే అనిత్యం. దేహి కాదు. బాల్యయౌవనాది దశలన్నీ దేహానికే గాని దేహికి అంటవు. దేహి చేతనంగా సర్వత్రా ఉన్నాడు. దాని నెవరూ నశింపజేయ లేరు. నశించేవి శరీరాలే. వాటికే జనన మరణాలు. త్రిగుణాత్మకమవి. గుణసంపర్కం వల్లనే దేహి అయిన ఆత్మ జనన మరణాల పాలయి బాధ పడుతున్నాడు. అవిద్యా కామ కర్మల వల్లనే ఈ దేహ సంబంధం మానవుడికి.

అవిద్య వల్ల కారణ శరీరం. కామం వల్ల సూక్ష్మ శరీరం. కర్మ వల్ల స్థూల శరీరం - మూడు శరీరాలతో సంపర్క మేర్పడింది. మిగతా రెండింటికీ అవిద్యే మూలం. అందుకే కారణ శరీరమన్నారు దాన్ని. తాను కాని దాన్ని తానని భ్రమపడటమే అవిద్య. అది మన చైతన్యాన్ని ఆవరించి శరీరం మేరకు తగ్గించింది. దానివల్ల మిగతాదంతా ప్రపంచంగా కనిపించి అది పొందాలనే కామ మేర్పడింది. ఇదే సూక్ష్మ శరీరం. కామాని కనుగుణంగా తనకు కావలసిందంతా పోగు చేసుకొనే కర్మ ఏర్పడింది. ఇదే స్థూల శరీరం. అది ఫలిస్తే సంతోషం. ఫలించకుంటే విషాదం.

కాబట్టి **బుద్ధి యుక్తో జహాతీహ.** ఆత్మ అంటే ఏమిటో దాని జ్ఞానమార్జించాలి. అప్పుడు **విహాయ కామాన్** - కామాన్ని

జయించగలడు మానవుడు. **నిర్మమో నిరహంకారః -** కామం పోవాలంటే అహం మమలు లేకుండా పోవాలి. అప్పుడే **సుఖదుఃఖేసమే -** సుఖదుఃఖాది ద్వంద్వాలు సమంగా భాసిస్తాయి సాధకుడికి. ఈ స్థితికే బ్రాహ్మీ స్థితి అని పేరు. **ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం.** నదుల వెంటబడి పోదు సముద్రం. అది కదలకుండా ఒకచోట స్థిరంగా ఉంటే నదులన్నీ వచ్చి అందులో చేరిపోతాయి. అలాగే నిష్కామంగా నీవుంటే నీ దగ్గరికే వస్తాయన్నీ. ఇదీ సాంఖ్యం చెప్పే మాట.

## కర్మయోగం

ఏ కామమూ లేకుండా ఊరక కూచుంటే దినచర్య ఎలా జరగాలి. దినచర్య అంటే కర్మే గదా. కామం లేకుండా కర్మ ఎలా చేయగలం. **నహికశ్చిత్ క్షణమపి** ఒక్క క్షణం కూడా ఊరక కూచోలేడెవడూ నిద్రలో తప్ప. అప్పుడు కామం లేదు కర్మ లేదు. కాని దాని వాసన లుంటాయి. అవి మరలా జాగ్రత్తులో బయటపడతాయి. ఇక ఎప్పుడీ కర్మ బంధం నుంచి విముక్తి.

కర్మ అంటే చేయటమూ నిష్కర్మ అంటే మానటమూ కాదు. ఏ పని చేసినా - అది మానసికమే గాదు. వాచికమే గాదు. కాయికమే గాదు - యజ్ఞార్థమని చేస్తూ పోవాలి. యజ్ఞమంటే ఈశ్వర స్వరూపం. ఈశ్వర చైతన్యమే నా చేత

ఈ పని చేయిస్తున్నదని భావించాలి. అప్పుడు నేననే అహంకారం పోతుంది. ముక్తసంగుడయి చేయాలి కూడా. అంటే ఫలితం నాకు అనుకూలించాలనే కామం కూడా పనికి రాదు. అదీ ఆ ఈశ్వరుడికే అప్పజెప్పాలి. అప్పుడు మమకారం కూడా తొలగిపోతుంది. అహం మమలు రెండూ పోతే కామం లేదు. కర్మా లేదు. అవి ఉన్నా జీవుడివి కావు. జీవుడీశ్వరుడి కర్పించాడు కాబట్టి ఈశ్వరుడివే. జీవకర్మ ఈశ్వరుడి కర్మే. జీవుడి కామం ఈశ్వర కామమే. ఇదీ కర్మయోగ సూత్రం.

## జ్ఞానయోగం

ఇలా ఈశ్వర భావన చేస్తూ దాని వెలుగులోనే జీవయాత్ర సాగిస్తూ పోతే కర్మ జ్ఞానంగా మారుతుంది. కర్మలో అకర్మా అకర్మలో కర్మ. రెండూ ఏకమవుతాయి. రెంటికీ భేదం లేదు. ఒకటి దృష్టి మరొకటి దాని ప్రసరణ. సముద్ర జలమూ దాని చలనమూ ఒకటిగాదా. అలాగే ఇదీ. అప్పుడు కర్త అయినా కర్త కాదు మానవుడు. జ్ఞానమనే అగ్ని కామకర్మలు రెంటినీ కాల్చి వేస్తుంది. అప్పుడు ఒక కర్మ చేస్తున్నా చేయనివాడే.

అయితే ఈ నిబ్బరం మన కలవడాలంటే ఎక్కువ పనులు పెట్టుకోరాదు. శరీరం నిలవటాని కెంతో అంతే

పెట్టుకోవాలి. లేకుంటే పనుల భారం మనలను కుంగదీస్తుంది. ఈశ్వర జ్ఞాన మలవడదు. అంతా ఈశ్వరుడనే జ్ఞానం మనసులో గట్టి పడితే వాడు గత సంగుడే ముక్తుడే. అలాటి వాడే పని చేసినా **సమగ్రం ప్రవిలీయతే.** ఆ కర్మ ఫలంతో సహా సమసిపోతుంది. వాణ్ణి బంధించదు. వాడి జీవితమే ఒక మహా యజ్ఞం. జ్ఞాన యజ్ఞమది. భౌతికం గాదు. అందులో ప్రతి ఒక్క ఆలోచనా క్రియా బ్రహ్మ స్వరూపమే. **జ్ఞానే పరి సమాప్యతే -** ప్రతిదీ సమష్టి చైతన్యంగానే దర్శనమిస్తూ పోతుంది.

ఇలాంటి జ్ఞాన మలవడాలంటే మాటలు గాదు. గురూప దేశ ముండాలి మొదట. గురువులంటే జ్ఞానులూ తత్త్వదర్శనులూ. వారిని శ్రద్ధాభక్తులతో సేవిస్తే జ్ఞానోపదేశం చేస్తారు. తన్మూలంగా సమస్త భూతాలలో ఆత్మనే దర్శిస్తూ పోయే సామర్థ్య మేర్పడుతుంది. అవిద్యా కామాది కాలుష్య మెంత ఉన్నా అది జ్ఞానంలో ప్రక్షాళన మయిపోతుంది.

కాని ఇలాంటి జ్ఞానయోగం కర్మ యోగం వల్లనే కలుగుతుంది. దానికి కొంత కాలం పడుతుంది. అది మన శ్రద్ధను బట్టి తత్పరత్వాన్ని బట్టి ఉంటుంది. అది ఒక శిక్షణ. దానివల్ల సంపాదించే ఉద్యోగం లాంటిది జ్ఞానం. జ్ఞానమే లభించిందో **పరాం శాంతిం** పరమమైన శాంతి

చేకూరుతుంది. దానికిక ఆలస్యం లేదు. అయితే అజ్ఞుడికీ అశ్రద్ధాళువుకూ సంశయ స్వభావుడికీ అబ్బేది కాదా భాగ్యం. కర్మయోగంతోనూ జ్ఞానాభ్యాసంతోనూ వాటిని పోగొట్టుకొన్న వాడికే జీవితంలో శాంతి సౌఖ్యం.

## కర్మ సన్న్యాసం

ఇక్కడ ఒక సందేహం. కర్మలు సన్న్యసించటమా లేక ఆచరించటమా - దేనివల్ల లభిస్తుంది శాంతి అని చాలామంది మల్లగుల్లాలు పడుతుంటారు. దానికి జవాబేమంటే జ్ఞానం లేకుండా తొందరపడి సన్న్యసించినా ప్రయోజనం లేదు. జ్ఞానముంటే సన్న్యసించ నక్కరా లేదు. అసలు జ్ఞాన ముదయించాలంటే కర్మ కావాలి మనకు. అయితే అది గుడ్డిగా అనుష్ఠించటం కాదు. ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరించటం. దాన్నే గీత కర్మయోగమని పేర్కొంటున్నది. కర్మయోగ బలం లేకుండా సన్న్యాసం సాధ్యం కాదు. సన్న్యాస మంటే మరలా ఏదో గాదు. **బ్రహ్మణ్యాధాయ కర్మాణి** బ్రహ్మ స్వరూపమే ఈ మనోవాక్కాయాలతో చేసే పనులన్నీ. కనుక దాని మీదనే కర్మలన్నింటినీ ఆరోపించాలి. తన మీద గాదు. వ్యష్టి బుద్ధి సమష్టి బుద్ధిగా మారాలి. ఇదే సన్న్యాసమనే మాట కర్థం.

**నైవకించిత్కరోమీతి.** అప్పుడే పని చేస్తున్నా - అది శాస్త్రీయమే గాదు లౌకికమే గాదు. నేనుగా ఏమీ చేయటం లేదు. ప్రకృతి గుణాలే దాని గుణాలతో సాంగత్యం పెట్టుకుంటున్నదని సాక్షిగా చూడటం అలవడుతుంది. మనస్సుతోనే వదులకోవా లేదైనా. శరీరంతో కాదు. అసలు ఏ జీవికీ కర్మలనీ కర్తృత్వమనీ సృష్టించ లేదీశ్వరుడు. **స్వభావస్తు ప్రవర్తతే.** త్రిగుణాత్మకమైన మాయాశక్తే వాటిని తెచ్చి పెట్టింది. సహజం కాదిది. ఆగంతుకం. కనుక సహజమైన మన ఆత్మ స్వరూపం మనమర్థం చేసుకొంటే చాలు. ఏ గొడవా లేదు. రాగద్వేషాలూ సుఖదుఃఖాలూ - ద్వంద్వాలన్నీ ఎగిరిపోతాయి. బ్రతికుండగానే సృష్టి రహస్యం భేదించగలడు మానవుడు. అదేదో గాదు. ఎప్పుడూ సామ్యావస్థలో **Eaqui Poise** మనస్సు నిలిచి ఉండటమే ఏకైకమైన సాధనం. ఒక సద్బ్రాహ్మణుడి దగ్గరి నుంచీ కసాయివాడి వరకూ అందరిలో ఉన్నదొకే ఒక బ్రహ్మతత్త్వం గదా అనేది సమదృష్టికి పరాకాష్ఠ.

# ఆత్మ సంయమం

అయితే ఇలాంటి సర్వాత్మ భావం మానవుడికి సిద్ధించాలంటే దానికెంతో సాధన కావాలి. మానవుడు తన్ను తానే ఉద్ధరించుకోవాలి. ఆత్మ జ్ఞానం కలిగే వరకూ మనస్సును వశంలో ఉంచుకోవాలి. వీడు తన - వీడు పరాయి అనే భేద దృష్టి పనికిరాదు. సమదృష్టి నలవరుచుకోవాలి. అలవరుచుకోవాలంటే యమ నియమాదులు కొంత కాల మవలంబించాలి. యుక్తాహార విహారాదులు పాటించాలి. శరీరం స్వాధీనమైతే మనస్సూ క్రమంగా స్వాధీనమవుతుంది. మనస్సు అన్నిటికన్నా ప్రధానమైన సాధనం. దాన్ని తొందరపడకుండా నెమ్మదిగా ఆత్మ చైతన్యంగా మార్చుకోవాలి. అది ఆత్మగా మారి నిశ్చలమైతే చాలు. అదే సర్వవ్యాపకమైన బ్రహ్మం. అప్పుడన్ని పదార్థాలలో తన ఆత్మే. ఆత్మలోనే సమస్త పదార్థాలూ దర్శనమిస్తాయి.

అయితే మనసనేది చంచలం కదా. అది మనకు స్వాధీనమయ్యే దెప్పుడు. ఆత్మగా మారేదెప్పుడది. బేజారు పడరాదు. అభ్యాస మొకటి - వైరాగ్యమొకటీ. ఇవి రెండే సాధనాలు దాన్ని వశపరుచుకోటానికి. మరి యావజ్జీవమూ అలాటి ప్రయత్నం చేస్తూ పోతే అది జీవించి ఉండగా

ఫలిత మిస్తుందో లేదో. ఇవ్వకపోతే ఏమిటి మనగతి అని కూడా బెంబేలు పడరాదు. సర్వాత్మ భావం సిద్ధించే వరకూ అభ్యాసం సాగుతూ పోవాలి. ఈ జన్మలో అది ఫలించక పోతే మరొక జన్మలో. ఆ జన్మలో కాకుంటే మరో జన్మలో తప్పకుండా ఫలిస్తుంది. ఎందుకంటే చేసింది వృధా పోదు. జన్మలనేవి అభ్యాసం కోసమే ఉన్నాయి. ప్రతి జన్మలో కొంత కొంత ప్రయత్నిస్తూ పోతే ఆ సంస్కారం తరువాత జన్మకు కలిసి వస్తుంది. అది ఏజన్మకో ఒక జన్మకు పరిపాకానికి వచ్చి సర్వాత్మ దర్శనం తప్పకుండా లభిస్తుంది. భగవానుడిచ్చే హామీ ఇది. ఇదీ ఆత్మ సంయమం మనకు చెప్పే మాట.

## జ్ఞాన విజ్ఞాన యోగం

పరమాత్మ ఈశ్వరుడు బ్రహ్మమని వర్ణించటమే గాని వాటి స్వరూపమేమిటో పూర్తిగా చెప్ప లేదింత వరకూ. ఇప్పుడా స్వరూపాన్ని బయట పెడుతున్నదీ అధ్యాయం. స్వరూపమూ విభూతీ రెండున్నాయి పరమాత్మకు. అందులో స్వరూపం నిర్గుణం. విభూతి సగుణం. గుణాలంటే సత్త్వరజస్తమస్సులనే ప్రకృతి గుణాలు. ఈ ప్రకృతి ఆయన శక్తే – సగుణంగా బయటపెడితే ఆయన ఈశ్వరుడు. అప్పుడీ చరాచర ప్రపంచమంతా ఆయన విభూతి లేదా విస్తారం.

అలా కాక నిర్గుణంగానే నిలిచిపోతే అది కేవలం చైతన్య స్వరూపం. అదే బ్రహ్మం. పరమాత్మ. ఇప్పుడీ రెండూ కలిపి పట్టుకొంటేనే పరిపూర్ణమైన ఆత్మ జ్ఞానం.

ఇందులో పృథివి మొదలు ఆకాశం వరకూ కనిపించే జగత్త్మాక విభూతి అయితే మనో బుద్ధ్యహంకారాలుగా కనిపించే జీవుడి ఉపాధి ఒక విభూతి అయితే - దీన్ని ధరించిన జీవ చైతన్యం మరొక విభూతి. అన్నీ కలిసి తొమ్మిదీ ఇవి. ఇవే శాక్తేయుల నవావరణలు. ఆత్మ చైతన్యాన్ని ఆవరిస్తాయివి. ఇదంతా తన శక్తేనను కొంటే ఈశ్వరుడు. దాని కధీనమై పోతే జీవుడు.

ఇంతకూ ఈశ్వరుడూ ఆయన ప్రకృతి రెండూ ఒకే ఒక తత్త్వం. దాని పరిణామమే ఈ చరా చర సృష్టి అంతా. కనుక **రసోహమప్సు -** సర్వత్రా ఉన్నదా ఈశ్వరుడే. మనలో కలిగే సాత్త్వక రాజస తామస భావాలు కూడా అదే. కాని ప్రకృతి గుణాల వలలో చిక్కి ఆమేరకే ఆగిపోయిన ఈ జీవుడికా స్వరూప మంతు పట్టడం లేదు. ఆర్తుల దగ్గరినుంచీ అందరూ సాధకులే. కాని ఎవడో ఒకడుంటాడు జ్ఞాని. వాడా ఈశ్వరుణ్ణి తన స్వరూపంగానే దర్శించగలడు. ఎన్నో జన్మలు గడిస్తే గాని ఆ జ్ఞానం కలగదు. అప్పుడే తాను తాను చూచేది అంతా పరమాత్మే అనే అనుభవ మేర్పడుతుంది.

కాని ఆయా కోరికలు బలంగా ఉండి ఆయా దేవతలను సేవిస్తుంటారు మానవులు. దానికి కారణం ద్వంద్వ మోహం. అది పుట్టుకతోనే ఏర్పడింది మనకు. ప్రకృతి గుణాలను దాటి పోనివ్వదది. గుణాధీనుడైన ఈ జీవుడికిక గుణాతీతమైన తత్త్వమెలా బోధ పడుతుంది. పడితే గాని సగుణాన్ని నిర్గుణం తాలూకు విభూతిగా దర్శించ లేదు. అలా దర్శిస్తే అది జ్ఞానమే గాక విజ్ఞానం కూడా అవుతుంది.

## అక్షర పరబ్రహ్మయోగం

అక్షరమంటే నశించనిది. అది మాయాశక్తి అయితే దాని కన్నా పరమైన అక్షరం పరమాత్మ. ఈ అక్షర మా అక్షరాన్ని చూపటానికే ఉంది. ఇది ఓంకార రూపంగా భావించారు పెద్దలు. ఓంకారమంటే అ ఉ మ – మూడక్షరాల సంపుటి. మూడూ మూడు ప్రపంచాలకూ మూడు శరీరాలకూ ముగ్గురు జీవులకూ సంకేతం. ఓంకారానికే ప్రణవమని కూడా పేరు. దాన్ని ఉచ్చరించేటప్పుడు దానికి వాచ్యమైన ఈ అర్థాన్ని మనసుకు తెచ్చుకోవాలి. వాచకమైన శబ్దమెక్కడ ఆగిపోతుందో అక్కడ ఈ జీవ జగద్భావాలు కూడా లయమయిపోతాయి.

వాచకంతోపాటు వాచ్యం కూడా లయమవు తున్నప్పుడవి రెండూ ఎందులో లయమవుతున్నాయో గమనించాలి సాధకుడు. అది ఏదో గాదు. గుణాతీతమైన తన స్వరూపమే. తనదే గాదది. సర్వభూతాలకూ అదే స్వరూపం. **అక్షరాత్పరతః పరః** - అక్షరానికి పరమైన అక్షరమది. దాన్ని తదాకారమైన ఆలోచనతో పట్టుకోగలిగితే అది జ్ఞానం. అలా కాక దీని ద్వారా దాన్ని ఏకాగ్రతతో భావన చేస్తూ అవసానంలో ప్రాణశక్తిని భ్రూమధ్యంలో చేర్చి అక్కడ నుంచి కపాలం దాకా తీసుకుపోయి సుషుమ్న ద్వారా బయటికి వచ్చి దాన్ని సూర్యనాడిలో ప్రవేశపెట్టి ప్రాణోత్క్రమణ చెందితే సత్యలోకం దాకా వెళ్లి అక్కడ ఈ జీవుడు నిర్గుణ జ్ఞానంతో తరిస్తారు. ఇది ధ్యాన మార్గం.

# రాజవిద్యా రాజ గుహ్యాం

ధ్యానమూ జ్ఞానమూ ఈ రెండింటిలో ధ్యానం క్రమముక్తికీ జ్ఞానం సద్యోముక్తికీ తోడు పడతాయి. ఇందులో ధ్యానమయింది. ఇక జ్ఞాన మెలాంటిదో వివరిస్తున్నదీ అధ్యాయం. రెండూ ఒకటే అనిపిస్తుంది. కాని తేడా ఉంది. ధ్యానమే ఒక్క మూర్తినో పట్టుకొని చేసేది. పైగా మిగతా మానసిక భావాలను లయం చేసుకొనే విధానం లేదందులో.

మహా అయితే మనసుకు రాకుండా త్రోసి వేస్తాము. జ్ఞానమలా కాదు. సర్వమూ బ్రహ్మమని చూచే చూపు. అందులో అన్యమైన భావాలన్నీ కలుపుకొంటూ పోవాలి మనం. అప్పుడే ఆత్మ అనాత్మ అనే తేడా పోయి అంతా ఏకమనే ఏకాత్మ భావం సిద్ధిస్తుంది.

ఇదే విద్య ఇదే గుహ్యం. విద్య అంటే జ్ఞానం. గుహ్యమంటే రహస్యం. అంతా తానే అయితే ఎవరున్నారిక చెప్పటానికి. అందుకే రహస్యమయింది. అనుభవమెప్పుడూ రహస్యమే. అందులో ఇది రాజరహస్యం. ఎక్కడో లేదా బ్రహ్మం. **ప్రత్యక్షావగమం.** ఎక్కడ చూస్తే అక్కడే. ఉండటమనే స్ఫురణే గదా అది. ఎక్కడ లేదు. ప్రతి పదార్థమూ ఉందనే గదా స్ఫురిస్తుంటుంది. ఆ స్ఫురణే ఆత్మ. నీవు స్ఫురించే పదార్థాన్ని చూస్తున్నావు. అది సవికల్ప దృష్టి. అలా కాక వాటి స్ఫురణ చూడు. అది నిర్వికల్పం. **సుసుఖం కర్తుం.** అలా చూడటం కూడా కష్టం కాదు చాలా సులభమంటున్నది గీత. సొమ్ములు చూచినట్టు వాటిలో బంగారం మాత్రం చూడలేవా. అది కష్టమా. అలాగే ఇదీ.

అసలు రహస్యమేమంటే ఆ స్ఫురణే అంతటా వ్యాపించి ఉంది. అందులోనే ఈ సమస్త భూతాలూ చేరిపోతాయి. కాని వీటిలో అది ఉందన గూడదు. అదే

వీటిలో. ఆ మాటకు వస్తే వీటిలో కూడా అది లేదు. అంటే ఉన్నదదే మరేదీ కాదని భావం. అయినా ఇవి కనిపిస్తున్నా యంటే అదే ఇన్ని రూపాలలో దర్శనమిస్తున్నది. అందులో నుంచే జన్మించి అందులోనే లయమవు తుంటాయి. దాని శక్తి అలాంటిది.

ఆశక్తి ప్రభావంతో నేనొక రూపం ధరించి అవతరిస్తుంటే నేనా అవతారమేనని అక్కడికే చూచి నన్నవ మానిస్తారు మూఢులంటాడు పరమాత్మ. ఎవరో ఉంటారు మహాత్ములు. వారు జ్ఞానయజ్ఞంతో నన్ను యజనం చేస్తుంటారు. అనన్య భావంతో పట్టుకొంటారు నన్ను. వారికే రూపం చూచినా ఏ క్రియ చూచినా అందులో అవి కనపడవు. ఆత్మే స్ఫురిస్తుంటుంది. ఆత్మ సర్వత్ర సమంగా వ్యాపించి ఉంది. అలాంటి భావనతో బ్రతికితే చాలు. చివరకు సర్వాత్మ భావాన్నే అందుకొని తరిస్తారు.

## విభూతియోగం

ఇంకా ఒక మాట చెబుతున్నాను వినమంటాడు భగవానుడు. నాస్వరూపం దేవతలకు ఋషులకే అంతుపట్టటం లేదు. కారణం అందరికీ ముందే ఉన్నాను నేను. నాకు జన్మ లేదు మరణం లేదు. ఇలా ఎవరైతే ఆత్మ స్వరూపాన్ని గుర్తిస్తారో వారూ అదే అయిపోగలరు. **యద్భావ**

**స్తద్భవతి.** మన భావనను బట్టే ఫలితం. అది సగుణంగా కొంత కాలం నన్ను భజిస్తే వారికి నిర్గుణ జ్ఞానం నేనే కలుగజేస్తా నంటాడు పరమాత్మ. మరి ఆ సగుణమైన విభూతి ఎలాంటిదో ఏయే భావాలలో దర్శించాలని అడిగితే సమాధాన మిస్తున్నాడు. అందులో మొదట నిర్గుణమైన స్వరూపాన్ని సంగ్రహంగా చెప్పి తరువాత తన విభూతినంతా వర్ణిస్తూపోతాడు.

**అహమాత్మా గుడాకేశ** - ఆత్మ స్వరూపమే అది. ప్రతిచోటా ఉన్నదనే స్ఫురణ ఏదుందో అదే ఆత్మ. అదే ప్రతి పదార్థానికీ ఆది మధ్యం అంతం. అది తప్పించి ఏ నామము లేదు. రూపము లేదు. పోతే ఇక ఈ నామ రూపా లేమిటంటారా. ఇవన్నీ దాని విభూతి విస్తారం. అదే చిలువలు పలువలు పెట్టి వర్ణిస్తాడు. ఆదిత్యులలో విష్ణువునని రుద్రులలో శంకరుణ్ణి వృక్షాలలో అశ్వత్థమని అశ్వాలలో ఉచ్చైః శ్రవమని ఇలాగా.

అయితే ఒక్కొక్క జాతిలో ఒక్కటేనా విభూతి అంటే. మిగతాది కాదా. ఎందుకు కాదు. అంతా అదే. కాని **ఏషఉద్దేశతః ప్రోక్తః** కేవల ముదాహరణ కోసం చెప్పానిలాగా. మరి వాస్తవమేమిటో తెలుసా. **నతదస్తి వినా యత్స్యాత్ మయా భూతం చరా చరం.** నేను కాని పదార్థమంటూ ఈ

సృష్టిలో ఏదీ లేదు. నీవు నన్ను ఏయే భావాలలో ధ్యానించాలని అడిగావు కాబట్టి ప్రత్యేకించి అలా చెప్పవలసి వచ్చిందని మరలా సంజాయిషీ ఇస్తాడాయన అర్జునుడికి.

## విశ్వరూపాధ్యాయం

అయితే ఇదంతా భగవద్విభూతి అని ఎంత చెప్పినా గ్రహించలేడు మానవుడు. దానికి కారణాలు రెండే. ఒకటి ఇదంతా ప్రపంచమని మామూలు దృష్టితో చూస్తున్నామే గాని అంత కన్నా విశేషంగా చూడలేక పోతున్నాము. రెండు ఈ భూమండలంలో ఎక్కడో ఒకచోట ఒక కాలంలో ఏ కొన్నింటితోనో సంబంధం పెట్టుకొని చాలా పరిమితమైన దృష్టితోనే జీవిస్తున్నాము గాని దేశకాల వస్తువులన్నీ కలుపుకొని అఖండమైన దృష్టితో చూడటం లేదు మనం. అందువల్ల అఖండమైన విశ్వమెక్కడో ఉంది మనకు కనపడటం లేదు. ఎక్కడైనా ఒక మహానుభావుడొక గారడీ చూపినట్టు దాన్ని మనకు చూపితే బాగుండననే గొప్ప కుతూహలం ప్రతివాడికీ.

కాని వాస్తవంలో మనం చూస్తున్నదంతా విశ్వరూపమే విభూతే. విభువు తాలూకుదే విభూతి. విశ్వేశ్వరుడిదే ఈ విశ్వరూపమనే అవగాహన లేదు మానవుడికి. విశ్వమనేది

విశ్వేశ్వరుడి రూపం. విభూతి అనేది విభువు యొక్క విస్తారం. ఆ విభువనండి. విశ్వేశ్వరుడనండి. అది మూలపదార్థం **Substance Base** దాని విశేషమే దాని ప్రదర్శనమే ఈ విశ్వం. దీని కధిష్ఠానమనండి. ఆధారమనండి - ఆ విశ్వేశ్వరుడే. అంటే పరమాత్మ స్వరూపమే చరాచర ప్రపంచాని కాధారం. దాని రూపమే ఇది - అదే ఇన్ని రూపాలలో భాసిస్తున్నది. దానికే విశ్వరూపమని పేరు పెట్టారు. అయితే ఎలాగూ మనం నిత్యమూ. చూస్తున్నాము గదా ఇక క్రొత్తగా ఎవడో చూపితే చూడాలని దేని కుబలాటం. చెప్పాము గదా. అండ పిండ బ్రహ్మాండాలన్నీ ఒక్కసారిగా ఆకళించుకోవాలనే ఆశ వదలక నని.

అయితే అది సాధ్యమా. సాధ్యమే. ఎప్పుడూ. దానివరకే గాక దాని కధిష్ఠానమైన **Base** విశ్వేశ్వర స్వరూపాన్ని గుర్తించ గలిగితే, అలా గుర్తించాలంటే దేశ కాల వస్తువుల పరిధి ఎంత ఉందో అంతా మనసుకు రావాలి. అదే దివ్య దృష్టి. అదే అర్జునుడికి కృష్ణుడు ప్రసాదించాడనే మాట. ఇచ్చాడు గదా అర్జునుడెందుకు భయపడ్డాడు. దృష్టి స్వప్రయత్నంతో వచ్చింది కాదు. తాత్కాలికంగా పరమాత్మ తనకిచ్చింది. అలాగైతే ప్రతి ఒక్కరికీ ఇవ్వగలడాయన. కాని ఎలా వస్తుందో అలాగే

పోతుంది. చూపాకరిచ్చినా చూచే స్తోమత ఒకటుండాలి గదా మానవుడికి. అది స్వయంగా తాను ప్రపంచానికి మూలమైన పరమాత్మ తత్త్వాన్ని చూచినపుడు గాని ఏర్పడదు. వేషధారిని చూడకుండా అతని వేషాలను చూస్తే భయపడి చస్తాడు. అలా చూచాడు అర్జునుడు. భూన భోంతరాలు వ్యాపించిన భూత భవిష్యత్తులు వ్యాపించిన – దేవదానవ మానవ పిపీలికాది బ్రహ్మ పదార్థాలన్నీ వ్యాపించిన రూపాన్ని. ఒక్కసారి చూడగానే అలవాటు లేక హడలి పోతాడు. దానికి కారణం దేశకాల వస్తు రూపాలనే చూచాడు గాని – అవన్నీ దేనికి చెందినవో ఆ మూలతత్త్వాన్ని చూడలేదు. అర్జునుడనేది ఒక నెపం. మనమే అర్జునులం. మనమూ అఖండమైన తత్త్వాన్ని చూడకుండా అది ప్రదర్శించే ఈ విశ్వరూపాన్ని ఏ కొంచెమో చూచి హడలిపోతున్నాము. ఇక అంతా చూస్తే ఎంత భయంకరమో ఎంత బెంబేలు పడతామో.

# భక్తి యోగం

అయితే మరి ఎలా చూడాలి. ఎలా అలవరుచు కోవాలా దివ్య దృష్టి. అనన్యమైన భక్తి యోగంతోనే అలవడుతుందా దృష్టి. అన్యమైన దాత్మ కన్నా వేరొకటి లేదనే భావనే అసలైన భక్తి. మనోవాక్కాయ వ్యాపారాలన్నీ

ఆ ఒకే ఒక భావనలో చేరిపోతే అదే నిత్యమూ నిలిచి ఉంటే రాగద్వేషాది వికల్పాలన్నీ వాటి పాటికవే లయమయి – ఒకే ఒక నిర్వికల్పమైన ఆత్మ స్ఫురణగా మారి అనుభవానికి వస్తాయి. అప్పుడిక దేని వైపూ మొగ్గు చూపదు వాడి మనస్సు. అంతా తానే – తానూ తానే, తనదీ తానే. ఇదే అనన్యమన్నా భక్తి అన్నా. విభక్తి కానిదే భక్తి. విభక్తి అంటే వేరయి పోవటం. అది కాదన్నప్పుడు ఏకంగా కలిసిపోవట మన్న మాట. భక్తి అనే మాట కదే శబ్దార్థమసలు. అప్పుడిక దేశ కాల వస్తువు లెన్ని వందలు వేలు కనిపించినా భయపడడు మానవుడు. అవన్నీ ఆత్మ స్వరూపం తాలూకు విలాసమే గదా అని బరవసా పడి చూడగలడు. ఇదే దివ్య దృష్టి. స్వార్జితమిది. ఒకరి నడిగి తెచ్చుకొన్న ఎరవు సొమ్ముగాదు. తొలగి పోతుందనే భయం లేదు.

## క్షేత్ర క్షేత్ర జ్ఞాధ్యాయం

అయితే ఇలాటి దివ్య దృష్టి మనకు ద్వైత దృష్టి ఉన్నంత వరకూ అలవడట మసాధ్యం. ద్వైత దృష్టి అంటే భేద దృష్టి. ఇది క్షేత్రం. అది క్షేత్రజ్ఞుడనే భావం. క్షేత్రజ్ఞుడంటే అన్నింటినీ దర్శించే జ్ఞానం. క్షేత్రమంటే దానికి గోచరించే జ్ఞేయ ప్రపంచం **Objective Field.** రెండూ కలిసి ఒకటే వాస్తవానికి. ఆ ఒకటీ క్షేత్రం కాదు. క్షేత్రజ్ఞుడు. మరి

క్షేత్రమో. అది ఏదో గాదు. ఈ క్షేత్రజ్ఞుడి విభూతి. దాని వ్యక్తమైన రూపమే. క్షేత్రజ్ఞుడంటే ఆత్మ చైతన్యం. అది దానిపాటికది నిరాకారం. అవ్యక్తం. అదే సాకారంగా వ్యక్తమయి కనిపిస్తే దాన్నే మనం క్షేత్రమంటున్నాము. ఆకాశం మొదలు మానవుడి మనస్సు దాకా అంతా క్షేత్రమే. ఈ క్షేత్రం క్షేత్రజ్ఞుడి ప్రభావమే గనుక అన్యం గాదు. అదే ఇది ఇదే అది. **సచయో యత్ప్రభావశ్చ** అని ఒక్క మాటలో బయటపెట్టాడీ రహస్యం వ్యాస భగవానుడు. అందులో **యః** అంటే ఆత్మ. **యత్ప్రభావః** అంటే దాని విభూతి అయిన ఈ అనాత్మ ప్రపంచం. విభువును విడిచి విభూతిని విభూతిని వదలి విభువును పట్టుకోరాదు. అది ద్వైతం. రెండూ కలిపి క్షేత్రజ్ఞుడి స్వరూపాపంగా దర్శిస్తే అది అద్వైతం. క్షేత్రంలో **అంతర్బహిశ్చ** క్షేత్రజ్ఞుడే వ్యాపించి ఉన్నప్పుడిక క్షేత్ర మెక్కడిది. క్షేత్రంగా కూడా కనిపిస్తూన్న దదే నని ఏకస్థం చేసి చూడాలి. అదే బ్రహ్మానుభవం అని చాటుతున్నది గీత.

# గుణత్రయాధ్యాయం

అయితే వస్తు సిద్ధంగా అంతా జ్ఞాన స్వరూపమైన ఆత్మే అయినా అదే జ్ఞేయమైన అనాత్మగా కనపడే సరికి దాన్ని గుర్తించక ఇదే సత్యమని దీన్ని పట్టుకొని సతమత మవుతున్నారు. దీనివల్ల కలిగే సుఖదుఃఖాదులను భవించలేక

దీనితోనే చివరకు కన్నుమూస్తున్నారు లోకులు. ఇదే సంసార బంధం. దీనికి కారణం గుణ సంగ మంటున్నది గీత. సత్త్వరజస్త మస్సులనే ప్రకృతి గుణాలు బంధిస్తున్నాయి మానవుణ్ణి. మనలో ఉన్నవి ఈ త్రిగుణాలే. మనస్సు సత్త్వం. ప్రాణం రజస్సు - శరీరం తమస్సు. ఇక గుణాత్మకం కాని దేది మానవుడిలో. పోతే ఈ గుణాలతో తాదాత్మ్యం **Identity** చెందిన నేరానికి ప్రపంచమంతా త్రిగుణాత్మకంగానే కనిపిస్తుంటుంది. ప్రపంచమంటే దేశ కాల వస్తు సముదాయమే గదా. దేశం సత్త్వమైతే కాలం రజస్సైతే వస్తుజాలమంతా తమస్సు. కాబట్టి బాహ్య జగత్తు కూడా గుణమయమే. దృగ్దృశ్యాలు రెండూ గుణమయమే అయ్యేసరికి బంధం తప్పదు. ఇది ఇలా ఉన్నంత వరకూ క్షేత్ర క్షేత్రజ్ఞుల ఏకత్వం సిద్ధించదు. సిద్ధించకుంటే మోక్షం లేదు మానవుడికి.

అయితే ఈ బంధం నుంచి బయటపడే దెలా మానవుడు. గుడ్డిలో మెల్ల అన్నట్టు సత్త్వగుణం కొంతమేలీ త్రిగుణాలలో. అది **ప్రకాశకం అనామయం.** వివేక జ్ఞానానికి తోడు పడుతుంది. దాని ఆసరాతో ఒక పని చేయాలి సాధకుడు. **నాన్యం గుణేభ్యః కర్తారం** - త్రికరణాలతో మనమే పనిచేసినా అది గుణాలే చేస్తున్నాయి నేను గాదు. మరినేనెవరంటే **గుణేభ్యశ్చపరం-** గుణాలకు సాక్షిగా ఉన్న

చైతన్యమే నేనని - ఇలా ప్రతిలోమంగా అనులోమంగా తన స్వరూపాన్ని పట్టుకోగలగాలి. అప్పుడే **మద్భావం సోధిగచ్ఛతి.** నా పూర్ణ స్వరూపం గుర్తించి **జన్మమృత్యు జరా దుఃఖైర్విముక్తః** జనన మరణ సమస్య నుంచి బయటపడతారని హామీ ఇస్తున్నది గీత.

## పురుషోత్తమాధ్యాయం

ఈ సాధన మార్గమే పురుషోత్తమాధ్యాయం కూడా ఇంకా చమత్కారంగా ఒక అశ్వత్థ వృక్షం మీద నెపం పెట్టి వర్ణిస్తున్నది. అశ్వత్థ మంటే రావిచెట్టు. చలదళ మని పేరు దానికి - ఎప్పుడూ చలించే స్వభావమా చెట్టుకు. అలాగే ఈ సంసార వృక్షం కూడా చలనాత్మకమే. ఏదీ నిలకడగా ఉండదిక్కడ. క్షరమిది. నశించేదని అర్థం. ఇది గాక అక్షర మొకటున్నది. అది దీనికి మూలమైన మాయా శక్తి. అది పరమాత్మ నాశ్రయించిన ఆయన శక్తి కాబట్టి క్షరం కాదక్షరం. పోతే ఈ క్షరాక్షరాలు రెంటికీ విలక్షణమైన దొక్కటే ఉంది తత్త్వం. అది ఆ పరమాత్మ చైతన్యమే. ఇవి రెండూ పురుషులైతే అది పురుషోత్తమ.

పురుషుడైనా ఇవి ఆయనలాగా పూర్ణ స్వరూపం కావు. అపూర్ణమే. పూర్ణంలాగా భాసిస్తున్నాయి. సాపేక్ష మివి **Relative.** నిరపేక్షం కావు **Absolute** నిరపేక్షమది ఒక్కటే. కనుక

వీటి రెండింటినీ క్రమంగా దాటిపోయి దాన్ని వాటేసుకోవాలి మానవుడెప్పటికైనా. అదే పురుషోత్తమ ప్రాప్తి. దానికి సమ్మోహ **Illusion** మడ్డు పడుతుంటుంది. జ్ఞాన చక్షుస్సుతో ఆ చీకటిని చీల్చుకొని ముందుకు సాగిపోవాలి.

అలా పోవాలంటే ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవిక సృష్టి అనే మూడింటిలో ఒకే ఒక ఆత్మజ్యోతిని దర్శిస్తూ ఉండాలి. **మమైవాంశో జీవలోకే.** ఆ పరమాత్మ అంశే వాస్తవానికీ జీవాత్మ. కనుక ఈ శరీరాద్యుపాధుల మేరకే ఉన్నా నను కోక సర్వత్ర సచ్చిద్రూపంగా నేనే వ్యాపించి ఉన్నానని తన వ్యాప్తిని తాను గుర్తు చేసుకోవాలి. అలాటి దివ్య దృష్టి అలవడితే సృష్టి అంతా తానే అయినట్టు తన స్వరూపంగానే గుర్తించి తరించగలడు.

## దైవాసుర సంపద్విభాగం

అలా దర్శించటాని కధికార సంపత్తి ఉండాలి మానవుడికి. లోకంలో మానవులందరూ రెండు జాతులు. కొందరు దైవ గుణాలు గలవారు. మరికొంద రసుర గుణాలున్న వారు. దైవ సంపన్నులు చాలా వరకు సాత్త్విక స్వభావులయి ఉంటారు. అసుర గుణసంపన్నులు రాజస తామస స్వభావులు. ఇందులో దైవసంపద అనేది మానవుణ్ణి బంధం నుంచి తప్పిస్తుంది. అసుర సంపద అంతకంతకు సంసార బంధంలో పడదోస్తుంది. అసుర సంపద అంటే

రజస్తమో గుణాల విజృంభణమే. అలాటివారికి అహంకార బల దర్పాది అవలక్షణాలెన్ని ఉండాలో అన్నీ ఉంటాయి. దానితో కన్నుగానక బ్రతుకుతుంటారు వారు. చివరకు వారికి ప్రాప్తించేది నరకమే.

**త్రివిధం నరకస్యేదం ద్వారం** - కామం క్రోధం లోభమనేని మూడూ మూడు ప్రకృతి గుణాలకు ప్రతీకలు. వాటి వలలో బడితే చాలు. అవి సరాసరి నరకానికే చేరుస్తాయి. ఆ తరువాత అసుర యోనులలో జన్మిస్తారలాటి వారు. ఏ జన్మకూ భగవత్ప్రాప్తి లేదు వారికి. పునరపి జనన మన్నట్లు జనన మరణ పరంపర అనుభవిస్తూనే పోతారు.

మరి దైవగుణ సంపన్నులయితే శాస్త్రోక్తమైన మార్గంలో జీవితం సాగిస్తూ చివరకు భగవత్స్వరూప చింతనతో జన్మరాహిత్యం చేసుకొని క్రమంగా ముక్తులయి పోగలరు. శాస్త్రాన్ని వదిలేసి తమ ఇష్టానుసారం బ్రతికితే ఇహంలో సుఖం లేదు. పరంలో శాంతి లేదు. అలా కాక శాస్త్రీయమైన మార్గంలో పయనించేవారు ఏది కర్తవ్యమో గుర్తించి అదే ఆచరించి దానికి తగిన సిద్ధి పొంది తీరుతారు.

# శ్రద్ధాత్రయం

దేనికైనా శ్రద్ధ అనేది ఉండాలి మానవుడికి. **శ్రద్ధామయోఽయం పురుషః యోయచ్ఛ్రద్ధస్స ఏవసః** - శ్రద్ధే మానవుడంటే. ఎముకలు కండలు రక్తం మాంసం కాదు.

లక్ష్యం మీద దృష్టికి శ్రద్ధ అని పేరు. అది ఉంటే దానికి తగిన ఆలోచనా - ప్రవర్తనా తప్పకుండా ఏర్పడతాయి. అది ఎప్పటికైనా జీవిత గమ్యాన్ని చేరుస్తుంది. సందేహం లేదు.

ఇది మూడు విధాలీ శ్రద్ధ అనేది. సత్త్వాది గుణాలను బట్టే ఏర్పడుతాయవి. సత్త్వం వల్ల సాత్త్విక శ్రద్ధ. రజస్సు వల్ల రాజస శ్రద్ధ. పోతే తమస్సు వల్ల తామస శ్రద్ధ. అవి మరలా వారు వారు తీసుకొనే ఆహారాన్ని బట్టి ఏర్పడుతాయి. అన్నింటిలోనూ సాత్త్వికమైన శ్రద్ధ ఉన్నవాడు సాత్త్వికమైన ఆహారమే సేవిస్తాడు. ఆయుస్సూ బలమూ ఆరోగ్యమూ పెంచే రసవంతమైన హృద్యమైన ఆహారమే వాడికిష్టం. కట్వామ్ల లవణాదులు కావు. అవి రాజసుల కిష్టం - పోతే పాసిపోయిన చెడిపోయిన అన్నపానాలు తామసులకు ప్రీతికరం.

ఇక యజ్ఞమూ తపస్సూ దానమూ మొదలైనవి కూడా ఎన్నో ఉన్నాయి వారి వారి శ్రద్ధను బట్టి ప్రవర్తించేవి. ఫల నిరపేక్షంగా కేవలం తనకు కర్తవ్యమని చేసేదే సాత్త్వికమైన యజ్ఞం. వేద గురు పూజా శౌచమూ బ్రహ్మచర్యమూ శారీరమైన తపస్సు. సత్యమూ ప్రియమూ హితమైన వాక్కు వాఙ్మయ తపస్సు. మనశ్శుద్ధి మౌనం సౌమ్యత్వం ఇంద్రియ

నిగ్రహం మానసమైన తపస్సు. ఇదంతా సాత్త్వికమే. దేశ కాల పాత్రల యోగ్యతను గమనించి చేసేది సాత్త్వికమైన దానం. ఇలా సత్త్వగుణాను గుణంగా సాగినప్పుడే అది జీవితానికి అన్ని రంగాలలో జయాన్ని చేకూరుస్తుంది. తుదకు ఓం తత్సత్ అని ఏది చేసినా ఆ బ్రహ్మ చింతనే మానవుడి శ్రద్ధా భక్తుల కనుగుణమైన మోక్ష ఫలాన్ని ప్రసాదిస్తుందని గీత ఇచ్చే హామీ.

# మోక్షసన్న్యాస యోగం

ఇంతకూ మోక్షమనే ఫలాన్ని రుచి చూడాలంటే దానికి సన్న్యాసమనేది ఆవశ్యకం. సన్న్యాసమంటే వదలుకోటం. కాషాయ కమండలు ధారణ కాదు. మనస్సన్న్యాసమే చెబుతుంది గీత బాహ్యాసన్న్యాసం కాదు. అంచేత వదలుకోవలసింది కర్మ కాదు. ప్రతి కర్మ నేను చేస్తున్నా ననే కర్తృత్వమూ – ఇది నాకు తప్పకుండా ఫలితమివ్వాలనే భోక్తృత్వమూ వీటినీ వదలుకోవలసింది. వీటికి అహం మమలని పేరు. ఇవే సంసారమంటే.

కాని అదైనా ఎలా వదలుకోటం. సాధ్యమా. సాధ్యమే. సర్వభూతేషు యేనైకం భావం. మనం లావాదేవీ పెట్టుకొన్న ప్రతి విషయంలోనూ అవిభక్తంగా వ్యాపించి ఒకటుంది.

అదేదో గాదు. ప్రతిదీ ఉంది ఉందనే స్ఫురణ. ఇలాంటి జ్ఞానం మనసులో ఎప్పుడూ ఏమరకుండా ఉంటే చాలు. మనసా వాచా కాయేన - నీవే పని చేసినా పరవాలేదు. అసలు నీ స్వధర్మం నీవు మానుకోనక్కరలేదు. ఏది చేసినా ఒకానొక సమష్టి చైతన్యం వెలుగులోనే ఇది నడుస్తూ ఉంది. నేను కేవలం దానికొక ప్రణాళిక **Medium** మాత్రమే నని భావిస్తూ పోతే చాలు. అది నీ బుద్ధిని శుద్ధి చేస్తుంది - ఏకాగ్రత కల్పిస్తుంది. ఇదే జ్ఞాన మార్గం. ఇది కాక మంత్ర తంత్రయోగా భ్యాసాదు లేవి పెట్టుకొన్నా అవి కేవలం ప్రయాసే - ఫలితమివ్వవు. దీనికే అనన్యభక్తి - అనన్య ధ్యానమని కూడా పేరు. ఒక దివ్య శక్తే నాలోనూ నేను చూచే సమస్త భూతాలలోనూ చేరి అన్నీ నడిపిస్తున్నదనే జ్ఞానం కన్నా గొప్ప భావన ఏముంది - అదే జీవితంలో శాంతి - జీవితా నంతరం మోక్షాన్నీ ప్రసాదిస్తుంది.

ఇంతకూ ఒక్క మాట చివరిసారిగా తెగేసి చెబుతున్నది గీత

**సర్వధర్మాన్ పరిత్యజ్య - మామే కం శరణం వ్రజ**

**అహంత్వా సర్వ పాపేభ్యో - మోక్షయి ష్యామి మాశుచః**

సచ్చిద్రూపమైన ఆత్మే సర్వ వ్యాపకం. సర్వ స్వరూపం. దాని విశేషాలే నామ రూపాలు. అవి ఏవో గావు దాని

ధర్మాలే అంటే లక్షణాలే. వాటిని గాదు మనం చూడవలసింది. అవి దేని లక్షణాలో ఆ మూలతత్త్వాన్ని పట్టుకోవాలి. పట్టుకొని అదే గదా ఇవి అని వీటిని దానిలో ఎప్పటికప్పుడు లయం చేసుకోవాలి. అంటే వీటిని ఆ రూపంగా చూస్తూ పోవాలి. బంగారమంటే ఏమిటో గుర్తించి అదే గదా ఈ కంటెలు కాసుల దండలనే సొమ్ములన్నీ అని ఆరూపంగానే వీటిని చూచినట్టు చూడాలి. అప్పుడా నేననే జ్ఞానం అఖండంగా దర్శనమిస్తుంది. అది కేవల జ్ఞాన స్వరూపం కాబట్టి అవిద్యా కామ కర్మలనే త్రివిధ పాపాలనుంచీ మానవుడికి ముక్తి లభిస్తుంది. సంసారంలో పడగొట్టేదేదో అది పాపం. పాతకం. పరిపూర్ణ జ్ఞానం లభిస్తే ఇక అజ్ఞానమే లేదు కాబట్టి దానితోపాటు కామకర్మలనే పాపాలు కూడా ఎగిరిపోక తప్పదు. పోతే సంసార బంధమనే సమస్య ఏముంది.

# చివరి మాట

ఇలాగా జీవిత సమన్యను అవలీలగా పరిష్కరిస్తున్నది గీత. అయితే ఇది కేవలం వస్తుసిద్ధమనే మాట మరచిపోరాదు మానవుడు. వస్తువెప్పుడూ పరోక్షం మనకు. అది మనకు బుద్ధి సిద్ధమైతేనే అనుభవం. **విమృశ్యైత దశేషేణ** దాన్ని బాగా నీ మనస్సులో విమర్శించి పరోక్షంగా శ్రవణం చేసిన సత్యాన్ని అపరోక్షంగా **Direct** అనుభవానికి తెచ్చుకో. అప్పుడే నీ సమస్యకు పరిష్కార మంటున్నది గీత. సమస్య బాహ్య ప్రపంచం వల్ల ఏర్పడినా అది నీ మనస్సుకు వచ్చినప్పుడే గదా ఇది నాకు సమస్య అనే అనుభవం నీకు కలుగుతున్నది. అలాగే పరిష్కారం కూడా బాహ్యంగా కేవలం వింటే కాదు. అది కూడా మనసుకు తెచ్చుకొని పదే పదే భావన చేయాలి. ఆ భావనే మన కను భవమిస్తుంది. ఇప్పుడీ లోకానుభవం కూడా శారీరకం కాదు. మానసికమే బాగా ఆలోచిస్తే. లోకానుభవమే మానసికమయి నప్పుడు మోక్షా

నుభవం భౌతికమెలా అవుతుంది. అనుభవమన్నప్పు డది బంధమైనా మానసికమే. మోక్షమైనా మానసికమే. అయితే బంధం సవికల్పమైన మనస్సు అనుభవిస్తే మోక్షం నిర్వికల్పమైన మనస్సనుభ విస్తుంది. నిర్వి కల్పమైన ఆత్మ స్వరూపాన్ని దర్శించి నప్పుడు మనస్సు నిర్వికల్పమే కావలసి ఉంది. అలాగే అయిందో ఇక అది మనస్సే గాదు. ఆత్మ స్వరూపమే. అంతా ఆత్మేననే దృష్టి ఏర్పడినప్పుడిక అనాత్మ ప్రపంచమే లేదు. ఇలాటి సర్వాత్మ భావాన్నే మన కుపదేశిస్తున్నది భగవద్గీత. అలాగే జీవించ మని కూడా బోధిస్తున్నది. ఇంతకన్నా గొప్ప బోధ ఏమున్నది. గీతా సారమిదే. ఉపనిషత్తుల దగ్గరి నుంచి బ్రహ్మ సూత్రాల దగ్గరి నుంచి భగవద్గీత వరకు శ్రవణ మనన నిది ధ్యాసనా రూపంగా ప్రస్థాన త్రయం మనకు చేస్తూ వచ్చిన జీవిత సందేశ సారమిదే.

ఓం

శాంతిః శాంతిః శాంతిః